# కృతిసమర్పణము



ఉ. ఆర్యనుతుండు, శ్రీహరిప
దాబ్జమరందవిలోలచిత్తస
త్కార్యుఁడు, రిక్తవృత్తిఁ బ్రమ
దంబును జెందినతత్వవేత్త, ధీ
వర్యుఁడు, శాంతిభూషితుఁడు,
భవ్యవికుంఠనివాసి ' కేశవా
చార్యుఁడు ' మత్పితామహుఁడు
స్వామ్యముగాఁ గొనుఁగాత మీకృతిన్.



# గ్రంథకర్తృవిజ్ఞప్తి



పాఠకులారా !

శ్రీమద్వాల్మీకికృతశ్రీమద్రామాయణమహాకావ్యమును దృశ్య కావ్యపంచకరూపమున నావిరచించినవానిలో నీ 'శ్రీరామప్రస్థానము' అయిదవది. ఇది ది 15-7-35 నుండి ది 11-9-35 లోనికాలములో వ్రాయఁబడినది. ప్రార్థనమాత్రమున నీనాటకము నామూలాగ్రముఁ బఠించి దీని కుపోద్ఘాతము వ్రాసి పంపిన నామిత్రములును, ఆంధ్ర విజయేత్యాద్యనేకగ్రంథకర్తలును, శతావధానులును, చీరాల పుర పాలకసంఘోన్నతపాఠశాలోపాధ్యాయులు నగు శ్రీమాన్ దూపాటి కొండమాచార్యులు, బి. ఏ., బి. ఇడి. గారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఈగ్రంథముద్రణమున పూఫులు మున్నగునవి సరిచూచి యసంస్కృతనాటకకన్యను ముద్రితసువర్ణాలంకారసర్వాంగసుందరిగ నొనర్చి నాకప్పఁజెప్పుటలో ననల్పసహాయమొనర్చు మన్మిత్రులగు బ్రహ్మశ్రీ చతుర్వేది అమరేశ్వరశాస్త్రిగారికిని, మహాశ్రీ పళ్ళె వేంకటసుబ్బారావుపంతులుగారికిని గృతజ్ఞతాపూర్వక నమస్కార ములు.

శ్రీమద్రామాయణగాథామృతపానాసక్తచిత్తు లగుపాఠకమధు పములకు శ్రీరామచంద్రగ్రంథమాలాపంచమపుష్పము సమర్పించు

ఒంగోలు, 22-7-36.

శ్రీవైష్ణవవిద్వచ్చరణపరమాణువు,
ఆచారి వేంకటరంగస్వామి అయ్యంగారు.



# ఉపోద్ఘాతము



'శ్రీరామపట్టాభిషేకము' (?) 'శ్రీరామప్రస్థానము' అనునీ యుత్తరరామచరిత్రను సుప్రసిద్ధాంధ్రకవివతంసులగు శ్రీమదాదూరి వేంకటరంగస్వామి అయ్యంగారు రచియించిరి. ఇందలి కథాభాగము శ్రీమద్వాల్మీకిరామాయణమునందును, 'నాటకేషు శకుంతలా' అని పేరెన్నికగనినకాళిదాసుకృతితోఁ బోల్పఁబడి 'ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే' అని ప్రసిద్ధిఁబడసిన శ్రీమదుత్తరరామచరితమునందును మనోహరమై వెలయుచున్నది. ఆంధ్రభాషయందు దీనినే ప్రబంధరూపమున కంకంటి పాపరాజును, దృశ్యరూపమునఁ బెక్కురును వ్రాసియుండిరి. దృశ్యరూపముగ నీకథను వ్రాసినవారిలోఁ జాలమంది భవభూతినాటకమున కాంధ్రీకరణమో లేక దానిఛాయను గ్రహించి స్వేచ్ఛానువాదమునో వ్రాసియుండిరి. ఇప్పు డీనాటకకర్త యించుక మార్పులతో వాల్మీకికృతశ్రీమద్రామాయణము ననుసరించి రచియించి ప్రకటించిన నాటకపంచకములో నిది కట్టకడపటిది. దీనితో నీకవి శ్రీమద్రామాయణమును సంపూర్ణముగ దృశ్యరూపమున వెలయించి జన్మసాఫల్యముఁ గాంచెననుటలో నించుకయు నతిశయోక్తి కానరాదు. పూర్వపుణ్యోద్భూతకవితాసరివంతిని భగవద్గుణానుభవ సత్కార్యదీక్షాపరతంత్రం గావించి కృతార్థతం బొరసినభక్తకవులలో నీగ్రంథకర్త యొకఁడని నావిశ్వాసము. 'రాఘవేశ్వరుచారిత్రము నెవ్వ రెన్నివిధుల నవర్ణించినం గ్రొలదే ?' యనునుడికారమునందలి యందమును గ్రహించి సామాన్యపుటితివృత్తముల నెత్తికొనక తారకబ్రహ్మమగు శ్రీరాముని చరిత్రము నారంభించి కృతకృత్యుఁడగుట కితని యాంతరంగికభక్తియే ప్రధానకారణమైయుండునని యూహింపఁదగియున్నది.

సహజమాధుర్యవిలసితమును, లలితపదభూయిష్ఠము నగునీ గ్రంథకర్తకవిత యితఃపూర్వమే వెలువడియున్నయితరగ్రంథముల

ద్వారా ఆంధ్రలోకమున కిదివఱకే పరిచయమైయున్నది. పూర్వ గీర్వాణాంధ్రకవులరచనలయందలి విశేషముల నీకవి చక్కఁగా జీర్ణించుకొనినట్టుల నీతనిగ్రంథముఁ జదివినవారు గుఱితింపకుండఁజాలరు. శృంగారకరుణరసముల జోడించి, పాత్రౌచితిని బోషించి పండిత పామరజనసమ్మోదసంధాయకముగ నీనాటకము రచియింపఁబడినది. ఇందలి రూపకోత్ప్రేక్షోపమాలంకారములు సమయసందర్భోచితములై నిసర్గమనోహరములై యున్నవి. ప్రథమతృతీయాంకములందలి కవిపేరుగల నిక్షిప్తాక్షరపద్యములు కవిగారి నియమానివార్యధారను వేనోళ్ళఁ బ్రకటించుచున్నవి. ఇందలి గుణౌచిత్యమునుబట్టి నటకులు దీనిని బ్రదర్శించియు, విద్యాశాఖాధికారులును, విశ్వవిద్యాలయాధికారులును దీనిని దగినకక్ష్యలకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయించియు గ్రంథకర్తను బ్రోత్సహించెదరుగాత. ఇక్కవి శ్రీరామానుగ్రహపాత్రుఁడై సమస్తసౌఖ్యములం గాంచి యానందించెడుంగాత.

హాల్ మకాం,
వంగవోలు.
29 5-36.

ఇట్లు,
శతావధాని శ్రీమాన్
పురాపాటి కొండమాచార్యులు, బి. ఏ., బి. ఇడి.
చీరాల.



## ఈ నాటకమునవచ్చు ముఖ్యపాత్రములు.

### 1 వ యంకము

శ్రీరాముఁడు
భరతుఁడు
సుగ్రీవుఁడు
అంగదుఁడు
హనుమంతుఁడు
జానకి
సేవకుఁడు

### 2 వ యంకము

త్ర్యంబకశర్మ, సుదర్శనశర్మ } అయోధ్య బ్రాహ్మణులు
భద్రుఁడు-రాజచారుఁడు
శ్రీరాముఁడు
లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు
జానకి
వాల్మీకి
సుమంత్రుఁడు
ఇరువురు మునిబాలకులు
ఇరువురు మునిపత్నులు
సేవకుఁడు

### 3 వ యంకము

బ్రాహ్మణుఁడు
శ్రీరాముఁడు
లక్ష్మణుఁడు
వశిష్ఠుఁడు
నారదుఁడు
శంబుకుఁడు- శూద్రతపసి
భరతుఁడు

### 4 వ యంకము

విష్ణుశర్మ, పద్మనాభశర్మ } అయోధ్య బ్రాహ్మణులు
శ్రీరామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు
కుశలవులు
సుగ్రీవుఁడు
విభీషణుఁడు
హనుమంతుఁడు
వాల్మీకి
జానకి
భూదేవి
బ్రహ్మ
వార్తాహరుఁడు

### 5 వ యంకము

శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు
ముని (కాలుఁడు)
దూర్వాసుఁడు
వశిష్ఠుఁడు
కుశలవులు
విభీషణుఁడు
సుగ్రీవుఁడు
హనుమంతుఁడు
విష్ణుమూర్తి
ఇందిర
సేవకుఁడు

# శ్రీ రామ ప్రస్థానము



## నాంది

చ. తన కని సాయమైనసుహితప్రకరంబును దన్ని, సద్యశం
బును గొన సీతఁ బాసి, తను మట్టినబ్రహ్మవధాఘనిష్కృతి
న్బొనరుచు వాజిమేధమునఁ బుత్త్రులఁ గాంచి, ప్రతిజ్ఞ భూమిఁ జా
చ్చినకుజతో వికుంఠపురిఁ జేరినరాముఁడు ప్రోచు సభ్యులన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు కలితపుష్పాంజలియై ప్రవేశించి సభ్యులపైఁ గుసుమములఁ జల్లి)

సూ:- నటీ! రూపకదర్శనకుతూహలు లగుసభ్యులహృద్వేగమును గమనించలేని నీపరేంగితానభిజ్ఞత కేమనవచ్చును? సత్వరము రంగమునకు రమ్ము.

నటి:- (ప్రవేశించి) నాథా! తమరాకకై యెదురుచూచుచు నిటనే వేచియుంటిని. ఏమట్లు రోషకషాయనేత్రులుగ నున్నారలు.

సూ:- ప్రేయసీ! లోకవృత్తమును జూచి

గీ. దోషనగములు తమయెడఁ దోఁచుచున్న
నొరునిదోషలవమె లోక మరయఁబూని
పూతచరితలనే యాడిపోసికొనుట
విని కషాయతఁగాంచెను గనులు నేఁడు.

న:- నాథా! శాంతస్వరూపులగు తపస్వు లుండునాశ్రమంబులఁ గ్రూరసత్వంబులుసైతము శాంతివహింప శాంతావతారమగునీసభ మ్రోల మీనేత్రకోకనదములు పుండరీకములు కాకుండుట కడు చిత్రముఁ గొల్పెడిని.

సూ:- (నవ్వుచు) ప్రేయసీ ! ఏదియో తలఁపునకు వచ్చి యట్లంటిని లెమ్ము. మనగొడవనఁబడి ప్రస్తుతము మఱచినారమే.

న:- నాథా ! ఏనాటకముఁ బ్రయోగింపవలయునో యాజ్ఞయిడుఁడు.

సూ:- ఇప్పటనే యుంటి నంటివికదా నాందీప్రస్తావిత మగునాటకమే సభ్యాసియుక్తము.

న:- శ్రీరామప్రస్థానమేకదా !

సూ:- బళా ! ఇట్టిసమయజ్ఞతకదా నిన్ను సదా నుతిపాత్ర నొనర్చుచున్నది. అగును. అదియే.

న:- నేను సమీపముననే యుంటిని. అట్లు కాకుండినను దాము లోకవృత్తప్రకటన మొనర్చుచుఁ జేసిన యంకురారోపణమునుబట్టినైనను మీయర్థాంగి యూహింప నసమర్థయా ?

సూ:- ప్రేయసీ ! కాదు. ముమ్మాటికిని గాదు. నాకంటె నేడాకు లెగఁజదివినదాన వనియే నాకుఁ దెలియును.

న:- నాథా ! దానిని రచించినకవి యెవరు ?

సూ:- ప్రేయసీ ! కవినే యెఱుఁగవా ?

ఉ. ఇంతకుముందె 'సింగరగిరీంద్రచరిత్రము', 'రాయచూరనిన్'
వింతచవుల్చెలంగు 'రఘువీరునిబాల్య', 'ప్రవాస' 'యత్నముల్'
సంతసమొల్క 'తద్విజయ' సత్కృతి నాటకభంగి నెవ్వఁ డో
కాంతరో ! వ్రాసె, నట్టికృతికర్త నెఱుఁగవె రంగనాథునిన్ ?

న:- నాథా ! ఎఱుఁగకేమి ? రామాయణప్రయోగపంచకము రచించిన కవినే విస్మరింతునా ? బాగుగ గురుతున్నది.

సీ. తత్త్వవిత్పతి హారితసగోత్రుఁ డాదూరి కేశవార్యుం డేకవీశుతాత
న్యాయవాదిపదంబునను మేటి వెంకటరామానుజార్యుఁ డేరసికుతండ్రి
చిల్కపాట్యన్వయాంచితుఁడు రామానుజధీమంతుఁ డేకవిమాతామహుండు
అపరధన్వంతరి యగుచిల్కపాటి తిర్మలవైద్యుఁ డేకవిమాతులుండు

షట్పాది గీ. కవిపికము పర్ణశాల సింగకవి యెవని, స్యాలకుఁడు ధమనీపరీక్షాచణుండు
సీ. ఎ. కే. చార్యుఁ డేకవిసింహుమఱఁది, యరయ అ॥ పెరుందేవి, యిందిరలు ధర్మ
పత్నులై కొల్తు రేకవీశ్వరుని అ॥ శా॥ రంగనాథుఁ డెఱుంగనే ! ప్రాణనాథ.

సూ:- తీగఁ గదుపుమన్నఁ బొద నంతయుఁ గదిపితివి. 'పా విచ్చెదఁ బాటఁబాడుము; మాడయిత్తుఁ జాలింపు' మనునట్లు చేసితివి. ఇఁక నీధోరణిఁ గట్టిపెట్టి యుచితఋతువర్ణనముచే మన ప్రయోగము మొదలిడఁబోవుదము.

నః- చిత్తము.

గీ. కువలయజనాళితోని కోర్కులు ఫలించి
రూపుఁగొనెనన రామచంద్రునివిధమునఁ
గువలయాక్షులలోనికోర్కులు ఫలించి
రూపుఁగొనె శరత్కాలచంద్రునివిధమున.

(తెరలో)

గీ. భద్రదం బైనయట్టియాభరతశాస్త్ర
కలనఁ గరణీయ మెంచఁగాఁ గడఁగ వకట!
రామభద్రుండు సభను జేరంగఁ జనెడి
భద్ర! వార్తల వేగఁ దెల్పంగఁ జనుము.

సూ:- ప్రేయసీ! శ్రీరామసార్వభౌముం డిటే వచ్చుచున్నాఁడు. వారిఁ జేరఁబోవుదము పద.

నటి:- చిత్తము. (నటీసూత్రధారులు నిష్క్రమింతురు)

(ఇది ప్రస్తావన)



# ప్రథమాంకము



## శ్రీరామసభామందిరము.

[భరత, సుగ్రీవ, విభీషణాంగద, హనుమంతు లుచితాసనముల కడ నిలువఁబడియుందురు]

శ్రీరాముఁడు:- (ప్రవేశించి) గురుతుల్యుఁ డగు జనకధరారమణుని, లక్ష్మణసహితముగఁ గేకయధారుణీశ్వరుని, గాశీపతిని దక్కు భూనేతల వీడ్కొని వచ్చితిని. ఏమామిథిలేశ్వరు నౌదార్యసర్వ సమత్వబుద్ధి! (సింహాసనాసీనుఁ డగును. అందఱుఁ గూరుచుందురు.)

ఉ. ఆదరణ న్మునీంద్రనుతుఁడై జనరంజకపాలనంబునన్
మేనరలీల వెంబడక మేదిని రంగ దరాతిమానసా [నా
హ్లాదకవృత్తి నెంతయు మహామహుఁడౌ నృపు స్వామిఁగొన్న
మేదిని చేయునాసుకృతి మేర వచింప విరించిశక్యమే?

చ. గొనబగుహీరసంచయముఁ గొండని నేను బహూకరింప, నం
దనలకు దాని నింపుప్రమదంబునఁ దుల్యముగా నొసంగెఁగా!
యెనయొకొ యీమహాశయున కేబుధులేని? యమూల్యవస్తువు
ల్తృణసముదాయ మీయనకు, దేవసముం డననొప్పు నీనృపున్.

రాజర్షి యగునీయనఘునివియ్యమే రఘుకులంబున కెంతయు మంగళప్రద మైనది. సోదరా! భరతా!

భ:- ప్రభూ! సేవకుని కేమియాజ్ఞ?

శ్రీ:- ఈరత్నశ్రేష్ఠముల వానరసార్వభౌమునకు, వీనిని రాక్షససామ్రాట్టున కొసంగుము.

భ:- (రత్నములఁ దీసి చేతఁబుచ్చుకొనును) సుగ్రీవవిభీషణులు ముందునకు వచ్చి వానిని గ్రహించి శ్రీరామచంద్రునకు భరతునకు నమస్కరించి నిజాసనముల నలంకరింతురు.)

శ్రీ:- అంగదహనుమత్కుమారులారా! ఇటు రండు.

అం, హ:- (వినమ్రులై నమస్కరించుచు భయభక్తులతో డాయుదురు.)

శ్రీ:- (ఇరువురఁ జేరఁదీసి తొడలపై నిడుకొని) సుగ్రీవమహారాజా!

ఉ. రాజకుమారు లిర్వురు పరాక్రమశాలుల ప్రాణమిత్రులు ... వీర ... స్వత
స్తేజముచేత మాన్యుల రుదీర్ణగుణా! భవదీయసూనుఁడున్
యోజనఁజెప్ప మంత్రి యగు టొప్పరె నాకు మహోన్నతమాన్యులై?

కష్టదశయందు సాయమొనర్చినవారియుపకృతి యాజన్మాంత స్మరణీయమై కృతజ్ఞతానివార్యమై యుండుఁగదా? ఏమియొనర్చిన వీరిఋణము తీరునాయని యోజించుచుంటి. చంద్రునకు నూలుపోగువలె నీమణిభూషణంబులఁ గొని యానందింపుఁడు. (తనమేని యమూల్యాభరణంబుల వారికిఁ దొడుగును.)

అం. హ:- (హర్షము సూచింతురు)

భ:- ఆహా! ఏమి యీరామచంద్రప్రభుని సోయగము!

గీ. పృథివి యంతటఁ దనదానవృష్టిఁ గురిసి
తనిపి, కొత్తుసుకట్టెదుటఁ బ్రత్యక్షమైన
శూన్యరఘుమేఘమట్లు లీమాన్యమూర్తి
భూషలను బాసి క్రొత్తసొంపును వహించు.

దానభూషణుం డగు నగ్రజునికీర్తిచంద్రికముం దియ్యాని నిస్తేజములుకదా?

శ్రీ:- భరతా! సర్వకపిభల్లూకసైన్యముల కుచితవిధి మణిభూషణంబుల నొసంగి పంపుము.

భ:- మహాప్రభూ! తమయేలుబడిలో వసుంధర నిత్యకల్యాణము పచ్చతోరణముగ నున్నదనిచెప్పుట యతిశయోక్తి కాదు. దాని నున్నదున్నట్లు వర్ణింప నాచతుర్ముఖుఁడో లేక యాసహస్రశిరస్కుఁడో శక్తుఁడేమోకాని మానవమాత్రునివశ మగుననుట యతిశయోక్తి. ఏలన

చ. చెఱుగు లొనర్చురక్కసులఁ జెంచుట దేవర, నిక్షపించుచున్
బడతులు నిర్భయంబుగను భర్తలఁగూడి సుఖింత్రు, భూజను
లెక్కడుమదిమి స్మరింగనరు; కన్నులపండువొనర్చు లోక; మె
య్యెడల సుఖంబు, శాంతి,నటియించెడి; దుఃఖము వాసెఁబూర్తిగన్.

మహాప్రభూ! సకాలవృష్టులఁ బర్జన్యుఁడు వర్షించుట భూప్రజ సస్యసమృద్ధిచే నలరారుచు రాజ్యమనిన రామరాజ్యమే రాజ్యమని వేనోళ్ళ శ్లాఘించుచు మిమ్ము రూపువహించినదేవతవోలె భయభక్తుల నవ్యాజానురాగమునఁ బ్రేమించుచు నెల్లకాల మీనృపాలుఁడే మనునటుల మిమ్ముల ననుక్షణ మాశీర్వదించుచు దేవతాప్రార్థన మొనర్చుచు నెదలపైఁ జేతుల వైచుకొని సుఖాబ్ధిఁ దేలుచున్నారలు.

(తెరలో)

గీ. దివసపూర్వార్ధమునను బ్రదీప్తుఁడైన
శాంతు నినుఁ గాంచఁగోరు పశ్చిమవధూటి
కరణి నుపవనాలోకనాతురత రాము
దేవి చను నిను నటఁ గాంచుభావమునను.

శ్రీ:- అనుజా! భరతా! నిండుచూలాలగు జానకి యుపవనాంతరమున నన్నుఁ జూడఁ గోరుచున్నదని ధ్వనించుకంచుకివాక్యంబుల వింటివికదా! పోయి వత్తును.

భ:- చిత్తము. అవశ్య మట్లేకాఁదగును. నాకాజ్ఞ (నమస్కరించును)

శ్రీ:- చిరంజీవ. పోయివత్తువుగాక.

భ:- (నిష్క్రమించును)

శ్రీ:- (క్రొంచెము పరిక్రమించుట నటించును. తెర లేవఁగాఁ జంద్రకాంతపుటరుగుపై జానకి యాసీనయై యుండును) ప్రేయసీ! జానకీ! అప్పుడే వచ్చితివా? నీవే గెలిచితివి. నీదే సిరి. నాది చుక్క.

జా:- ఆర్యపుత్రులకుఁ బాదదాసి జానకి నమస్కరించుచున్నది. (నమస్కరింపఁబోవ)

శ్రీ:- జానకీ! వలదు. వలదు. నీయుపచారములు వాక్యములనే చాలును. పూర్ణగర్భవతివి. కార్యరూప మనవసరము. నీభక్తి యనన్య మగుట నే నెఱుఁగనా?

జా:- (చిఱునగవుతో) నాథా! ఈయుపచారవాక్యంబుల మఱచితి. సిరిచుక్కలనుమాత్రమే నిర్దేశించితిరి. ఇఁక దెబ్బ యెవరిది?

శ్రీ:- జానకీ! మఱచిపోయినవానిని మఱువనీక మరల నేల త్రవ్వెదవు?

శా. ఛాయల్గ్రిక్కడినీకపోలముల నోచానా! యిటు ల్నవ్వి యొంతే యెఱ్ఱందనము స్ఫుటించుచును బ్రీతిన్జోటుఁజూపించితో
నాయాత్మస్థలపోయుచో టిపుడె కర్దర్ణ వ్రేల్మ్రాన న్నీటి పై
న్గాయంబున్ప్రసరింప మూఢుఁడనె? యాకర్ణాంతలోలేక్షణా!

జా:- ప్రాణప్రియా! చోటు బలుబాగుగ గుఱితించితిరిగాని కారణము వక్కాణించుటలోమాత్రము మించుక పొరపడితిరనిచెప్పఁ జనువున సాహసించుచున్నదాన. క్షమింపుఁడు.

శ్రీ:- జానకీ! నాపొరపాటును దిద్ద నింతక్షమార్పణ మేల? చెప్పుము.

జా:- గీ. కోకనదరుచిఁ గ్రిక్కడిమీఁకరాంగు
ళులచవులు నాకపోలములోనఁ బ్రతిఫ
లనముఁ జెందుచు నరుణిమఁ గొనఁగఁజేసె
దాని మందహాసమున సుంతయును గాదు.

శ్రీ:- జానకీ! నీవచించినకారణముకూడ సమంజసమే కాని యదియే యిదమిత్థమని యెట్లు సిద్ధాంతీకరించెదవు?

జా:- సర్వజ్ఞులరగుమీ కిది వేద్యముకాకయా ? నాచేఁ జెప్పింపఁ దలఁచి యిట్లనుచున్నారు.

శ్రీ:- జానకీ ! చెప్పుము. ఏల వేధించెదవు ?

జా:- నాథా ! కరాంగుళప్రతిఫలనమైన వాని నావలకుఁదీసిన నాగండములయందలి యరుణిమ యదృశ్యమగును; మందహాస కృతమైన నదృశ్యము కాదు.

శ్రీ:- (తనచేతుల నావలకుఁ దీసి) జానకీ ! నిజము. నిజము. నీకారణము కడుసమంజసము. ఇప్పుడు నీకపోలము ముకురమువలె స్వచ్ఛముగ నున్నది. కావున నాయరుణిమ యంగుళప్రతిబింబమే నిస్సంశయము.

గీ. అణువుపరిమితి గణియింప ననువుఁజేయు
యంత్రములు కల్గు నబ్జాక్షి యంతరంబు
బుద్ధిసూక్ష్మత గణియింపఁబోవ సాయ
పడెడియంత్రము లే దబ్జభవున కేని.

జా:- నాథా ! పోనిండు. ఆకమలాకరంబును విలోకింపుఁడు.

శా. అంతర్వత్ని యభీష్టమా వనవిహారార్థంబుఁ జేకూర్చి తా
నెంతో సంతసమందుహంసమును జితేశా ! విలోకించితే ?
కాంతంబౌ వనజంబుల న్గనుచు వేడ్కల్మోసులెత్తంగ నం
దెంతోహాయిగ నీఁదుహంసిఁ గనుమా హేలావిలాసాన్వితన్.

శ్రీ:- జానకీ ! గర్భవతుల యభీష్టముల నెఱింగి తీర్చుట నాథుల ధర్మము. ఆహంసనాథుఁ డాయంతర్వత్ని కోర్కె నావిధముగఁ దీర్చుచుఁ దనధర్మము నిర్వర్తించుచున్నాఁడు. అందు విచిత్రమేమున్నది ?

జా:- అట్టినోము నేను నోచుకొననా ?

శ్రీ:- జానకీ ! ఎట్టినోము ?

జా:- ఆహంసి నోచుకొనిననోము ?

శ్రీ:- అనిన నది ఏది ?

జా:- శాంతవనవిహారము.

శ్రీ:- గోలా! నీవాంఛితము పదునాల్గేండ్లు తీఱినదికదా? మరల వన విహారమునే యేల వాంఛించెదవు? వలదు. వలదు. నీవాంఛిత మేదో విస్పష్టముగా నెఱిఁగింపుము. క్లేశలతోడను ధ్వనులతోడ నేల నామనంబుఁ గలఁచెదవు? స్త్రీలు ప్రసవమునకు సహజ ముగఁ బుట్టినిండ్లకుఁబోవ వాంఛింతురు. నీకోర్కి కూడ నట్టిదేనా?

జా:- నాథా! సర్వసుఖసంధాయకుల రగుమీసన్నిధికంటె నాకుఁ బుట్టినిల్లు సుఖదాయకమని యెంచుదునా? అట్లెన్నటికిని దలఁప కుఁడు.

గీ. ధనముచేఁ దులఁదూఁగుచుండినను, బీద
తనమునను దోఁగుచున్నను, ధవుఁడె పరమ
దైవమని యెంచుకాంతామతల్లులకును
గాంతునిగృహంబె పుట్టింటికంటె మేలు.

శ్రీ:- జానకీ! నీపతిభక్తి నాకుఁ దెలియనిదా? అది కాకుండిన నీ కోర్కె యేదియో విశదీకరింపుము.

జా:- నాథా! విశ్వదుండ వగునీవు నాకోర్కెఁ దీర్చకుందువా? ఇదిగో చెప్పుచున్నదాన.

ఉ. భూవలయాఘనాశకరపూతజలాంచితమై స్రవించునా
పావనగంగతీరమున భాసిలు నాఋషికన్యకాళిసం
భావితమౌ తపోవనులఁ బల్మరు నాటలనాడ నిచ్చ; నా
భావముఁదీర్ప క్రమ్మొకొ దఁ గృపావర! యట్ల యనుగ్రహింపవే.

శ్రీ:- అర్ధాంగీ! జానకీ! నీయీస్వల్పవాంఛితమును గాదందునా? వనమార్గజ్ఞుఁ డగులక్ష్మణుఁడు రేపటి నెల్లుంట రాఁగలఁడు. అతఁడు రాఁగానే తప్పక పంపుదును.

జా:- క. కోరిక యధరాగ్రింబును
జేరకయుండఁగనె యట్లు చేసెదనని వి

స్తారోదారత వరమిడు
వారికిఁ బ్రియలగుట యెల్లవారికి వశమే ?

నాథా ! నాముద్దుఁ దప్పక చెల్లింతురుకదా ?

శ్రీ:- ప్రేయసీ! నీము ద్దెప్పుడేని జెల్లించకుంటినా చెప్పుము. సౌమిత్రి రాకయే తడవు. తప్పక నీకోర్కెఁ దీర్తును. ఆవైపుఁ జూడుము.

ఉ. విచ్చిననోళ్ళతోడఁ బలవించుశిశుప్రకరంబుఁ దన్పఁగా
వచ్చువిహంగసంతతులు, భానునితీక్ష్ణకరప్రసారణా
హెచ్చుగఁగ్రాఁగి ధాత్రి వహియించెఁ గవోష్ణత,భాస్కరుండదే
చొచ్చెడిఁబశ్చిమాంబునిధి,సాక్షైడుఁ బద్మిని,నిక్కెఁ గల్వయున్

క. మినుకు మనెడిరిక్కలగమి
కిని దీటగుదీపకాంతికి న్వెచ్చుతమం
బును బాపుచంద్రబింబా
నన! యంతిపురంపుత్రోవనన్ బోవుదమా ?

జా:- ప్రాణనాథా! భవదాజ్ఞానుసారమే.

శ్రీ:- ఎవఁడురా యచ్చట ?

సేవకుఁడు:- (ప్రవేశించి) స్వామీ! కరదీపిక వెలిఁగింపఁబడినది. ఇటు. ఇటు. (సేవకుఁడు కాలుదివ్వటీ జూప జానకీశ్రీరాములు నిష్క్రమింతురు.)



# శ్రీరామప్రస్థానము



## ద్వితీయాంకము

### అయోధ్యాపురవీథి

[ త్ర్యంబకసుదర్శనశర్మలు ప్రవేశింతురు ]

త్ర్యం:- సుదర్శనశర్మా ! నీవు నూఱుచెప్పుము వేయి చెప్పుము. లోకమున మంచిసెడ్డ లనుద్వంద్వ మధికారిభేదము లేక సర్వదా ప్రత్యక్షమే.

చ. గొనబగురత్నరాజి యనుకొన్నఁ బగుళ్ళను గూడియుండు, భూ
జనులఁ గరంచునంచును బసందగునట్టిగులాబిఁ గోయఁగాఁ
జన శితకంటకంబు లటఁ, జందురునిలోనఁ గళంక; మిద్ధర
న్గుణములు దోషయుక్తములె కోవిదదృష్టిని జూచువారికిన్.

సు:- ఓయి రంధ్రాన్వేషీ ! నల్లముక్కద్దము ధరించినవారికి లోకమంతయును నల్లనిదై కనుపట్టునట్లు సహజదోషైకదృక్కు వగు నీకు సుగుణంబుల మించి దుర్గుణములే తెల్లగోడమీఁద నిడినమసిచుక్కలగతిఁ గాన్పించుచుండును. ఇదియేనా నీవు చెప్పినకోవిదదృష్టినిర్వచనము ? బళిరా ! బాగుగ నున్నది. నీవు కర్మము చాలక పెట్టుశాస్త్రిలవైనను గోవిదసహజ మగుగుణగ్రహణశూన్యత దానికిని, పుట్టుశాస్త్రిలవనుట కంతకంటెను దగవేమో యని నాతలఁపు. ఏలన

ఆ. కడలిలోనఁ బుట్టుగరళంబు లో నిడి
బుడుతనెలను మౌళి నిడినయట్టి
త్ర్యంబకాఖ్యఁ దాల్చి యనిశంబు దోసంబె
నెమకునీదుపేరు నీరసంబు.

భద్రుఁడు:- (ప్రవేశించి) ఈబ్రాహ్మణు లిరువు రేదో గట్టిగా వాదించుకొనుచున్నారు. రాజభటుని జూచిన నూరకుందురు కానఁ జాటుననుండి వీరిసంగతి వినిమెద. (చాటున నక్కును)

త్ర్యం:- సుదర్శనశర్మగారూ! పెద్ద లెట్లనినఁ జెల్లును. పోనిండు. నిన్న నాచాకివానిగాథ వింటిరిగదా! వానిపలుకు లసమంజసములా? ఇది భూజనము తమభార్యలవర్తనము సహింపుఁడని చెప్పుట యగునా? కాదా?

సు:- ఓరిమూర్ఖుఁడా! వానికిని నీకు వ్యత్యాస మేమేని కలదని నీవైనఁ జెప్పఁగలవా? చదివిన వానికంటెఁ జాకివాఁడే మేలనినట్లు నీకంటెను వాఁడే యన్నివిషయంబులను మేలని నాతలంపు. జ్ఞానశూన్యుఁడై యెవఁడో యొకనివైపు తనభార్య చూచినదని తెలిసి దాని నిల్లు వెడలనడపుచుఁ గులముపెద్దలు విచ్ఛిన్నము కాఁబోవుచున్న భార్యాభర్తలఁ గదియఁదోయ యత్నింప వారలను గాదనుచు "రావణాసురుఁడు దొంగిలించుకొనిపోయి తనయింట్లో సంవత్సరముపాటు పెట్టుకున్న భార్యను తిరిగి తీసుకొనివచ్చి యేలుకుంటున్న శ్రీరామయ్యను కాదురో; యిఁక మీసుద్దులను చాలించిపొం" డన్నమాటనే మననముచేసికొనుచు నాప్రస్తావమే తెచ్చుచున్నావు.

త్ర్యం:- శర్మగారూ! నే నంటినని యంతకోప మేల? తాము వినలేదా?

సు:- తెలియనిమూర్ఖుఁడు వాఁడనిన నీవు ననవలయునా?

ఉ. బట్టలమోయుగార్దభము భంగిని మాఢ్యముఁదాల్చి పల్కునా
రట్టడి చాకిపల్కులె తిరంబని చెప్పఁగఁబూనెదేల? యా
గట్టులవైరి, బమ్మ, కఱకంఠుఁడు, నగ్గి, సొదంజొరంగ రా
షట్టి, వచింపరే జనకుపట్టి పతివ్రతయంచు వేమఱున్.

అవియన్నియు గణింపక నోటికివచ్చినట్లు వాఁగిన నేమి లాభము? ఈవాఁగు డెవ్వఁడేని రాజభటుఁడు వినెనా నీపనిఁ బట్టించునని యెఱుఁగవు. అమాయికుఁడవు.

త్ర్యం:- (నలుదిక్కులు పరికించును.)

భద్రుడు:- (ప్రవేశించి కషాయితనేత్రుఁడై త్ర్యంబకునివంకఁ జుఱ చుఱ జూచును)

త్ర్యం:- (గడగడ వడఁకుచు) నాయనా నా! త త తప్పు క్షక్షక్ష మించు బాబూ బాబూ! (అని చేతులు పిసికికొనును)

సు:- భద్రా! పిల్లవాఁడేకట్టతఁ డేమెఱుఁగును? నన్నుఁజూచి యీ కుఱ్ఱవాని క్షమింపుము. నామాటఁ ద్రోసివేయక వీనిని క్షమింపుము. బతిమాలుకొనెదను.

భ:- (తల యూచుచు) ఈతాతగారివాక్కులఁ దలఁచియును, నీవు బ్రాహ్మణుఁడ వగుటను, నీవెంత లఘువుగ మాటలాడినను మహారాజుగారు బ్రాహ్మణభక్తిపూరితు లగుటను నీమిడిసిపడుమెడ మీఁదఁగల వాఁగుఁబోతుతల నిలిచినది. లేకుండినఁ జెక్కుపోయిన తాటిపండువలెఁ బగ్గముదూరమున నీతల యిప్పటికి పడి దొర్లుచుండవలసినది. నోటికి బుద్ధిఁజెప్పుకొని యిఁక నెన్నఁడు నిట్లు పేలకుము.

త్ర్యం:- బుద్ధి. బుద్ధి. (అని వడఁకుచు వెనుకకు వెనుకకుఁ జూచుచు నిష్క్రమించును.)

సు:- భద్రా! దీర్ఘాయుష్మాన్ భవ. శాంతమునను విప్రభక్తిని శ్రీరామచంద్రుని బోటు వనిపించుకొనిననీకు సుఖమగునుగాక.

భ:- చిత్తము. పెద్దల యాశీస్సుకదా?

సు:- (నిష్క్రమించును) (తెరలో) భద్రా! ఏమి యాకలకలము?

భ:- (అదరిపడి స్వగతము) అయ్యో! ప్రభువులవారు కడుసమీపమునుండియే నను హెచ్చరించుచున్నారే! నే నీతగవునందు నిమగ్నుఁడనై యున్నచోటుసైతము గమనింపలేదే! వారు దీనిని వినియుందురా? (ప్రకాశముగా) ప్రభూ! వచ్చుచున్నాఁడ. (బిరబిర నిష్క్రమింపఁబోవఁ దెర యెత్తఁబడును. శ్రీరాముఁ

డేకాంతమందిరమున నాసీనుఁడై యుండును. భద్రుఁడు తలపాగ కొనఁ గండ్లు తుడుచుకొనుచు సమీపించును.)

శ్రీ:- భద్రా! ఏమి యీకలకలము? నీకన్ను లేమట్లు రక్తముఁ గ్రక్కుచున్నవి? కారణ మెఱింగింపుము.

భ:- (దిటము వహించి) మహాప్రభూ! ఏమియు లేదు. ఇచ్చట నెవరో యిరువురు బ్రాహ్మణులు లోకములోఁగల గుణదోషములఁ జర్చించుకొనుచుండ నే నాప్రక్కన యుండుట తటస్థించెను.

శ్రీ:- (భద్రునివంకఁ బరిశీలించి) ఏమట్లు వడఁకుచున్నావు? ఏమియు భయము లేదు. నీ విట్లగుటకుఁ గారణము మున్నెఱింగింపుము.

భ:- మహాప్రభూ! అనవసరమగు ప్రసంగముచే వారలు రెట్టించుకొనుచుండుట మందలించి పంపివైచుటచేఁ గొంచె మాక్రోశము వచ్చెను.

శ్రీ:- భద్రా! నేఁటి నీచర్యయంతయు నాకు సంశయాస్పదముగా నే యున్నది. ఆయనవసరప్రసంగమేమో నీవు మందలించుటయేమో నీవు తొట్రుపడుటకుఁ గారణ మేమో సత్యమెఱింగింపుము. నాయాన కలదు.

భ:- (నిట్టూర్పు నిగుడించి) మహాప్రభూ! అవధారు. మీరాజ్యంబున నెల్లెడ మీరావణయుద్ధజయమును గుఱించియు, మీసోదరుల భ్రాతృభక్తిని గూర్చియు, మాతల్లి జానకీదేవిగారి పాతివ్రత్యమును గూర్చియు ననుకొనని సెలవులు శూన్యములు.

శ్రీ:- భద్రా! ఆసంగతి చెప్పుమనిన నేవేవో తీసికొనివచ్చి చెప్పెద వేల?

భ:- నే నిట్టిశుభవార్తల వినుచు వచ్చుచు నిచ్చట బిగ్గరగా రెట్టించుకొను నిరువురవిప్రులఁ గంటిని. అందులో నొకఁడు కుఱ్ఱవాఁడును మూర్ఖుఁడై మొన్న నెవరివైపో చూచినదని నెపమిడి భార్యను వెడలనడపిన చాకలవానివాక్యములు సమంజసములు కావా యనెను. అందులకు వృద్ధుఁడు మూర్ఖుఁడా! వానికిని నీకును

వ్యత్యాసము లేదా ? రావణుఁడు చెఱఁబెట్టినసీతను మరలఁ గొని యేలుకొనుచున్న శ్రీరాముఁడు కాదని వాఁడనిన బ్రాహ్మణుఁడవు పండితుఁడవు నీవందువటరా ! వానికిని నీకును దారతమ్య మేమి యనిగద్దించి,యిందబ్రహ్మేశ్వరసురలు నగ్నిహోతృఁడు సాదఁజొచ్చి చెక్కు చెదరకుండ వెడలిన జానకిని దెచ్చి యిచ్చి యామె పాతివ్రత్యమున నిష్కళంకయని వెల్లడింపలేదా ? ఆ పరమసాధ్వికి నీ చాకెతకుఁ బోటియటరా యని గద్దించుచుండె. నే నాకుజ్జ్వానిని మందలించి పంపితిని. మహాప్రభూ ! ఇదియే సమాచారము. ఇదియే నాకోపకారణము. భృత్యునివాక్కులకు క్షమింప వేఁడుచున్నవాఁడను.

శ్రీ:- భద్రా ! ఇందు నీతప్పేమున్నది ? తక్షణము లక్ష్మణభరత శత్రుఘ్నులను నేఁజూడఁగోరుచున్నాఁడనని చెప్పుము.

భ:- మహాప్రసాదము. (నిష్క్రమించును)

శ్రీ:- ఆహా ! లోక మెంతకలుషితమైనది ! గుజ్జ్రమును గాడిద నొకటి చేసి మాటాడెదరుకదా ! కర్మఫలానుసారముగ దండకాటవిఁ జిక్కి రావణాపహృతయై యశోకవనమందు నివురుగప్పిననిప్పు వోలె దినముల వత్సరములట్లు గడపి తనపాతివ్రత్యంబును లోకమునకు వెల్లడింపఁ జితిఁజొచ్చి సిగపువ్వు వాడక యగ్నిహోత్రునిచేతను దక్కుసురలచేతను బ్రశంసింపఁబడి యగ్నినైనతము పవిత్రము చేయఁజాలునట్టి జానకికే యపవాదమా ! కటకటా !

చ॥ సురగణవందనీయపరిశుద్ధచరిత్రముచేత వహ్నిఁజొ
చ్చి, రయముతోడ వెల్వడినశీతకరాస్యవు, రామచంద్రభూ
వరుసహధర్మచారిణివి, భవ్యపతివ్రత వైననీకు నీ
ధరణిజనంబు లాడునడి తప్పక పోయె విరించివ్రాఁతచే.

రామచంద్రా ! విరించివ్రాఁతఁ దప్పింప నీకగునా ?

చ॥ మునుల మదాంధదానవసమూహకృతాపదఁ బొందునట్లు, బీదనరుల బాధితాత్ములుగ, ధర్మవిహీనుల భోగులట్లుగా,

ధనదునిమిత్రు భిక్షుకవిధంబున, పెన్నిధి వేసదారిగా
నొసరిచి సారంద్రిష్ఠనజు నొక్కండెఱుంగ సమర్థుండే భువిన్ !

అక్కటకటా ! పామరత్వమునం బడి విధిని దూషించితిని. ఎవరికర్మ వారిది. దాని ననుసరించి విధి వ్రాయునే కాని దాని కన్యథాత్వముం గల్పింప నాతండైన సమర్థుండా ? కాండు. కాండు. ముమ్మాటికిని గాండు. రామా ! పట్టాభిషేకంపునాంటిమాట నొకసారి స్మరించుకొనుము. జనానురంజక మగురాజ్యనిర్వహణమున నాత్మీయుల నెవ్వరినైనను నాప్రాణములనైనను మర్పింప వెనుదీయనని కదా చెప్పి మకుటంబు ధరించితివి ? అయిన సీత నిశితపరీక్షితకదా ? అదియునుగాక యంతర్వత్ని. ఆమెయెడల ద్రోహ మొంచనగునా? ఛీ ! నిష్కళంకం బగు రవివంశరాజచరిత్రంబున నీకళంక మలముకొనిన దానినిం దీసివేయం బ్రయత్నింపక యీరాఘవుం డెన్నటికినిం గాంతావ్యామోహంబునం జిక్కి వంశద్రోహి కారాదు. కాంజాలండు. కాంబోండు.

మ. అవనీరాజ్యముఁ జిల్లిగవ్వవలెఁ బ్రాణాళి న్తృణంబుల్వలెన్,
భువిజ న్జెల్లనికాసురీతిగను, దమ్ముంగుఱ్ఱల నైవ్వరుల
ట్లు వెస న్బాయుటకున్ లవంబు మది రాటూనుండు చింతించునే
రవివంశంబును నిష్కళంకము నొనర్పం జేయునప్పట్టునన్ ?

సేవకుడు:- (ప్రవేశించి నమస్కరించి) జయము జయము మహారాజు గారికి. చిన్నప్రభువులు తమయాజ్ఞకై హాజారమున నిలిచి యున్నారు.

శ్రీ:- సత్వరమ ప్రవేశపెట్టుము.

సే:- మహాప్రసాదము. (నమస్కరించి నిష్క్రమించును)

శ్రీ:- (బాష్పములం దుడుచుకొనుచుం దల వంచి నిట్టూర్పు నిగుడ్చును. లక్ష్మణ, శత్రుఘ్న, భరతులు ప్రవేశింతురు)

ల:- (విభ్రాంతితో స్వగతము) ఏమి యన్నగారిమో మిట్లు కళావిహీనమై దుఃఖకలుషితమై మేఘాక్రాంతచంద్రబింబము ననుకరించుచున్నది. ఆలసింపఁదగదు. తత్క్షణమ కనుంగొననగు.

ల, భ, శ:- (భయభక్తులతో ముందునకు నడచి) మహాప్రభువులకు లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు నమస్కరించుచున్నారు. (నమస్కరింతురు)

శ్రీ:- (నిట్టూర్పు నిగుడ్చి) దీర్ఘాయుష్మంతో భవత. తమ్ములారా! ఆ యాసనములఁ గూర్చుండుఁడు.

లః- అగ్రజా! నిత్యశాంతినికేతన మగుదేవరవదనారవిందము దుఃఖ నిలయమై కన్పట్టుచు మమ్ము సంశయార్ణవంబున ముంచుచున్నది.

చ. గడియకుఁ జక్రవర్తి వనఁగల్గెడిపట్టది మాటిపోయి న
ట్టడవిని వాసమేర్పడినయప్పు ఖరాదులఁద్రొక్కి బిట్టుక
ట్టెఁడులను ముట్ట నొంటి రభటిల్లఁగఁ బోయెడిపట్టునేఁ గనం
బడుదరహాసచంద్రిక భవద్వదనేందునిఁ జాయ నేటికిన్ ?

శ్రీ:- తమ్ముఁగుఱ్ఱలారా! విషయ మట్టిదేకనుక నట్లు మాటువలసి వచ్చినది. బహిఃప్రాణంబు లగుమీయెడల దాఁచునర్థంబులు రాముని కేంతునే? శ్రద్ధతో వినుఁడు. నే శాసింపఁబోవున దెంత యహితమైనను బాగుగ నిర్ధారణచేయఁబడినది కావున నెదురాడక యొనర్పఁదగినది. ఎదురాడినవానిని వైరిగఁజూతును. తెలిసినదా?

ల,భ,శ:- (వడఁకుచు) చిత్తము.

శ్రీ:- లక్ష్మణా!

చ. దనుజుని రావణు న్దునిమి, ధాత్రికి మేలొనరించి, భూమిజాం
గొనుతఱి నేను సందియముఁగొన్నఁ జితి న్వెసఁజొచ్చిసీత న
య్యనలుఁడు పుణ్యశీల యని యప్పుడు తెచ్చుట, గుంపులౌచున
య్యనిమిషు లౌనటం చనుట లన్నియు నీ వట విన్నవే కదా ?

లః- అగ్రజా! అగును. అయిన నిపు డేమివచ్చె?

శ్రీ:- అనుజులారా! రవివంశయశశ్చంద్రిక జానపదనాగరదూషణ మేఘాచ్ఛాదిత మైనది. అట్టి సాధ్వినిఁగూర్చి యీలోకజనము లబ్బా! దుర్భరము. అవాచ్యము. చెప్పక తప్పెడి దేమున్నది. రావణునియింట నొకసంవత్సర ముండినకాంతను శ్రీరాముఁడు

సిగ్గుమాలి తీసికొనివచ్చి యేలుకొనుచున్నాఁడని యనుకొను చున్నారలఁట !

ల:- ఆ. ఆలాగా ! (కోపమున) అట్టిమూర్ఖుల నీక్షణమ యీకాక్షే యకంబున కెఱఁజేసి రూపుమాపుదు. ఆజ్ఞయిండు.

శ్రీ:- లక్ష్మణా ! మేర మీఱకుము. (శాంతివిజితకోపమున) పాలి తులు పాలకదేహసములు సుమా. స్వామిభక్తు లగునాప్రజల శిక్షింప నుంకింతువేల ? నేను జేయునిది వారేమనిరి ? అంతటఁ జాలించి నావాక్యము సాంతముగా వినుము.

ల:- చిత్తము. (చొపలు వేసికొనుచు) బుద్ధి. బుద్ధి.

శ్రీ:- ఈకళంకముఁ దొలంగించుకొనుట మన కందఱి కవశ్యకర్తవ్య ము. లక్ష్మణా ! ఈకార్యంబునకుఁ గార్యశూరుఁడవు నీవే సమ ర్థుఁడవు. నిన్న జానకి వాల్మీకాశ్రమప్రాంతతపోవనముల ముని కన్యలంగూడి యాడుకొన వాంఛించె. ఆనెపంబున నామెను వేకువన గొంపోయి యచ్చట వదలిరమ్ము. మాఱాడక నా యాజ్ఞ నిర్వర్తింపుము. పోయిరండు. (భరతశత్రుఘ్నులు గడగడ లాడుచు నిష్క్రమింపఁ దెరవ్రాలును. లక్ష్మణుఁడుమాత్ర ముం డును.)

ల:- (నిర్విణ్ణుఁడై నలుదిక్కులు పరికించి) ఇది కలయా! నిక్కవమా క్షణములో శ్రీరామచంద్రుని ..., యట్లననేల యయోధ్యా రాజకుటుంబసౌఖ్యదినములు దుఃఖహేయసంబులుగ మాఱినవి. అది యేమికర్మమోకాని మాజానకీమాతమొగమున నావిధాత యేతూలికతో భాగధేయచిత్రముఁ జిత్రించెనో దానితోడనే నా నొసటఁగూడ వ్రాసియుండునని తోఁచుచున్నది.

గీ. జగములం గల్గుసుగుణపుంజంబు భూమి
జాతఁ గొల్వంగవచ్చినచాయ సకల
దుఃఖములుకూడ నామెపొందునె వరించెఁ
దొంటిభవమందుఁ జేసినదోస మేమొ ?

ఇట్లు తలపోయుచుఁ గర్తవ్యము మఱచితిని.

చ. వలనగువృత్తముల్గలుగు వారల, దుష్టుల, నొక్కరీతి నే
తలఁచెడిచోటనుంట యహితంబు వనంబులె మేలటంచును
న్గలకలరావముతో రణపుక ట్లననొప్పు శకుంతసంతతు
ల్జలజహితాగమం బెఱుఁగఁజాలెడి నగ్రజుపన్పుఁ జేసెదన్.
ఎవఁడురా యక్కడ ?

సేవకుఁడు:- (ప్రవేశించి నమస్కరించి) జయము జయము రాజపుత్రులకు. ఏమియాజ్ఞ ?

ల:- సుమంత్రుని సరథునిగఁ దత్క్షణము రమ్మనుము.

సే:- చిత్తము (నమస్కరించి నిష్క్రమించును)

ల:- (కొంతవడి పరిక్రమించి) అదిగో పరమపూత జానకీమాత వచ్చుచున్నది. పాదాభివందన మొనరించెద.

జానకి:- (ప్రవేశించఁగా లక్ష్మణుఁడు ప్రణమిల్లి లేచును) దీర్ఘాయుష్మాన్ భవ. వత్సా ! లక్ష్మణా ! వేకువనే వచ్చితివేల ?

ల:- (తలవంచి) అగ్రజునాజ్ఞఁ దమ్ముఁ దపోవనములకుఁ గొనిపోవుటకు.

జా:- ఆహా ! శ్రీరామచంద్రా !

గీ. తలఁపు వెలువడెనో లేదొ తత్క్షణంబె
వల్లెయని దానిఁ దీర్పంగఁ బంపినావె
సోదరుని ? నీదుహృదయంబు చూడఁజూడ
వెన్నకంటెను మృదుతరం బెన్నఁదగదె ?

వత్సా ! మునిపత్నుల దర్శింపఁ గొన్నియుపాయనంబుల, వలువల, భూషణంబులఁ గొనివచ్చెద.

ల:- భాగ్యము.

జా:- (నిష్క్రమించును)

ల:- అక్కటా ! ఎంతయమాయికురాలు ! హా ! హతవిధీ ! నిన్నేమనఁజెల్లునో నాకే తోఁచకున్నది. కఠినాత్ముల మధురవచస్కులఁ జేయుదువుకదా ?

గీ. నరకకూపంబుఁ బోలుమనంబుఁ గప్పఁ
దేనెపూఁతపల్కుల నిడెదే జనులకు ?
కప్పకూఁతపాముప్రకావె కమలజాత !
లోకవంచనాచతురత నీకె కలదు ?

అదిగో మాత వచ్చుచున్నది. నాయావేదనను గాన్పింప నీయరాదు.

జా:- (కొన్ని వలువలతో భూషణంబులతోఁ బ్రవేశించి యటఁబెట్టి) వత్సా ! ఇవి మునిపత్నీమనోరంజకము లగునా ? ఇవి చాలవా?

ల:- (వానివైపే బదులుచెప్పక చూచుచుండును)

జా:- వత్సా ! పలుక వేమి ? చిత్త మన్యధాయత్త మైన ట్లున్నదే.

ల:- (కంఠము సరదుకొనుచు) జననీ ! లేదు.

జా:- వత్సా ! ఈసంభారములు మునిపత్నులకుఁ దగినవేనా ? చాలునా ?

ల:- (చాలునని సూచించుచుఁ దల పంకించుచు) ఆ. ఆ. (వినుట నభినయించుచు) అదిగో సుమంత్రచోదితమైనరథనేమిధ్వానము. రథము మొగసాల నిలుపఁబడినట్లున్నది. జననీ ! ఇఁక నేమి యాలస్యము ?

జా:- వత్సా ! ఏమియు లేదు. సేవకుని రావించి వీనిని రథముఁ జేర్పింపుము. నే నిదే వచ్చుచున్నదాన.

సుమంత్రుఁడు:- (ప్రవేశించి) జయము జయము జానకీమహారాజ్ఞకి రాజపుత్రులకు.

జా:- సుమంత్రా ! అభ్యుదయోఽస్తు.

సు:- రాజపుత్రులయాజ్ఞానుసారము రథము మొగసాల నిలిచీయున్నది.

ల:- సుమంత్రా ! వీనిని రథముఁ జేర్పింపుము.

సు:- చిత్తము.

సేవకుఁడు:- (ప్రవేశించి వానినిఁ దీసికొనిపోవును)

జా:- (అద్దమునెదుట సుమముల సవరించుకొని బయలుదేరును)

ల:- జననీ! ఇటు. ఇటు (ముందు సుమంత్రుఁడు త్రోవఁజూపు చుండ లక్ష్మణుఁడు జానకి నిష్క్రమింతురు. తెర యెత్తఁబడును. రథస్థులై జానకీ, లక్ష్మణ, సుమంత్రు లుందురు)

జా:- వత్సా! లక్ష్మణా! తపోవనాలోకనాకాంక్షిణి నగునాయుత్సాహమెల్ల నేలొకో కుగ్రింకినట్లు తోఁచుచున్నది.

క. ఎల్లెడ నపశకునంబులె
జల్లనిపించెడిని, సంతసము చెడె, వగపుల్
వెల్లివిరిసెఁ, గుడికన్ను
ట్లల్లలనాడఁగఁ దొడంగె నది యేమిటికో.

ఇవియే యననేల?

గీ. పవనకంపితలతవోలెఁ బదము మొదలు
శిరమువఱకు దేహంబు తందరను బూనెఁ
గడుపులోఁ జేయి నిడి తెగఁ గలఁచినట్లు
తోఁచు; సుఖమొకో రామచంద్రుండు! వత్స!

అత్తగార్లకు క్షేమమేకదా? భరతశత్రుఘ్నులు సుఖులేకదా? ఏల యకారణముగా నాస్వాంతము చింతాడోలిక నిట్లూఁగుచున్నది? లక్ష్మణా! ఇంతలోననే యెంతదూరము వచ్చినారము?

గీ. ఇండ్లు, వాకిండ్లు, నుపవను, లెత్తుగలుగు
వప్రతోరణకుడ్యము ల్వాసె దృష్టి
గోపురాగ్రము ల్మన మనుకొనెడిలోన
సిరివిధమున నదృశ్యతఁ జెందె నకట!

ల:- (ఖిన్నకంఠముతో) జననీ! కోసలరాజ్యలక్ష్మి వగుసీ వెడలిన నాపట్టణశ్రీ యదృశ్యతఁజెందుట యేమివింత?

జా:- వత్సా ! ఈరేయియేకదా మన మీతపోవని నుండుట. రేపు పయనమై యయోధ్యను దరియుకొలఁది నయోధ్యాశ్రీ మరల దృశ్యయగుఁగదా ?

ల:- (స్వగతము) అబ్బా ! దుర్భరము. దుర్భరము. ఈమనోవేదన నింకెంతసే పాపుకొనఁగలను ! ఎంతదూర మణఁచిపెట్టఁగలను ? ఈతపోవనాభివర్ణనముచే నించుక శాంతివహింపఁ బ్రయత్నించెద. (ప్రకాశముగా) తల్లీ ! గోమతి దాటితిమి. అవిగో గంగాప్రాంత తపోవనులు.

చ. నిముసములోనఁ బెద్దవయి నిక్కఁడికర్ణము లిట్లుత్రిప్పుచున్
దమనయనంబుల స్జవశిథంబుచు మించుచు వచ్చుని స్ససం
భ్రమముగఁ గాంచులేళ్ళవె, జపాసుమజైత్రమునీశలోకవ
స్త్రములవె, హాహామధూమ మదె తప్పక తెల్పుఁ దపోవనం
[బులన్.

ఏమా కర్ణపేయ మగుజాహ్నవీనినదము !

చ. జనములపాపపుంజములఁ జక్కనడంతు మదీయవారిఁ గ్రుం
కిన నని ఘోషఁ జేయుచు నొకించుక యుత్తరమీయకుండినన్
దనపథమందుఁ గానఁబడుస్థావరపాళియఘంబుఁ బాపుచున్
జనముల నుద్ధరింతు ననుజాహ్నవి పిల్చును మాత ! వింటివే ?

(స్వగతము) అకటా ! శోకస్థితి నేవియు మార్పఁజాలవుకదా !

గీ. రామశాసనాశనిన యిక్కోమలాంగి
వనటఁ జెందెడి ముందె, పావనిని గంగఁ
జొత్తమనినను రామానుజుండు; రాము
నాజ్ఞ యొకదుండె నెటుమీఱు నక్కటకట !

గీ. చత్తమన్నను రామాజ్ఞ చావనీదు
బ్రదుకుదమటన్న నీదుఃఖహ్రదము నిండి
పొరలఁజొచ్చెను గన్నీటితరఁగ లనఁగ
నలుగువారినఁ గొంతశాంతిలునో యేమొ ?

జా:- (స్తబ్ధయై) ఏమి లక్ష్మణా! ఇట్లు దుఃఖించుచున్నావు?

చ. సునిశితవైరిబాణములు చుట్టినసంగరరంగమందు నే
ర్వనధులు పొంగి ముంపఁగను వచ్చినఁ గష్టతరంగపాళి పై
కొనినఁ జలింపనట్టినెఱగుండెగలాఁడవు వత్స! యంగనా
జనములకంటె లొచ్చుగ విషాదముఁ జెందుకతంబుఁ దెల్పుమీ.

ల:- (నమస్కరించి లేచి) తల్లీ! నావాగ్దీపంబుల దుఃఖపారావార
ము ముంచుచుండ నెట్లుచెప్పుదు? చెప్పక తప్పెడిదేమున్నది!
పరమపూతా! జానకీమాతా!

ఉ. కాముకునట్లు రావణుఁడు గైకొనిపోయిన సీతఁ గ్రమ్మఱ
న్నామితకీర్తి రాఘవుఁడె గైకొనెఁగాయని కొందఱాడఁగా
భూమిసుతా! తపోవనులఁ బుచ్చెఁగ నిచ్చవహించుని న్నవని
నాథుఁడు వీడిరమ్మనియె నన్గతినాత్ముని మాతృవంచకున్.

జా:- హా! రామచంద్రా! హాతాస్మి. హాతాస్మి. (మూర్ఛిల్లును)

ల:- (శైత్యోపచారములఁ జేయ సేదదేఱి)

జా:- హా! రామచంద్రా! నాపూర్వజన్మకర్మమును, మంచిపెద్దల నర
యక నోటికివచ్చినట్లు పలుకుభూప్రజలను నను కొనవలసినదేకాని
జననిందాభీరు వగునిన్నుఁగాని, భ్రాత్రాజ్ఞావశవర్తి యగునీగుణ
ఖని లక్ష్మణునిగాని, యెన్నటికి ననఁజెల్లదు. తొలిజన్మమున నే
పుణ్యదంపతులఁజూచి సహింపక వారి కవాచ్యవియోగముఁ
గూర్పఁ గారణభూతనైతినో యాపాపఫలము నన్నిట్లు కట్టికుడుపు
చున్నది. నే నేమి చేయఁగలదానను? లోకంబునఁ గలదుఃఖ
కష్టంబు లన్నిటికిఁ బుట్టినిల్లునైనకతంబున నవియెల్ల న న్నాశ్రి
యించినవి. ఏకపత్నీవ్రతుం డగునాభర్తవంశము భూమిపై విచ్ఛి
న్నముకాదేని నే నీనిముసమునన ప్రాణపరిత్యాగ మొనర్పఁ బరమ
సంసిద్ధనై యున్నదాన. వత్సా! నావైపు పరికింపుము. నిండు
చూలాలి నగున న్నిట్టికట్టడవి నొంటిగ విడిచిరా నాజ్ఞసేయ
జనానుమతంబుగను, ధర్మశాసనవిధంబున ధారుణీపాలన మొనర్పు

పరమకారుణికోత్తముఁ డగురామచంద్రునకే తగుఁగాని యన్యునికిఁ దరమా ?

లః- (కన్నీటిఁ దుడుచుకొనుచు నవ్వలిమొగమై) జననీ! జానకీ!

మ. పదునాల్గేడు లరణ్యవాసమున నంబా ! మిమ్ముల న్గొల్చుచో
హృదయంబారఁగఁ బాదవందనముకై యేప్రొద్దు నేతెంచుచో
సదయాత్మా! నినుఁ దేరిచూచెనొకో యీసౌమిత్రి? యెబ్భంగినీ
దుదశ న్జూచెడి రామచంద్రుఁ డిటకున్ద్వారస్థుఁడైయున్నచోన్.

తల్లీ ! నాకాఠిన్యమునకు నన్ను క్షమింపుము.

జా:- అంబాకృతపరవనితాలోకా! సుశ్లోకా! లక్ష్మణా! నీ వేమి చేయఁగలవు? నాయనా! అక్కటా! న న్నెవరేని ప్రశ్నించిన నేమని చెప్పుదునా యనునది పాలుపోవుటలేదు.

ఉ. ఏవిధి సిగ్గువీడి వచియింపఁగఁగల్గుదు లోకనిందచే
నావిభుఁ డిట్లు నన్ను విపినంబుల కంపె నటంచుఁ? జెప్పఁగా
నేవిధి నమ్మువా రొరుగు? లిఁ కిట్లు వచించిన భర్తృదూషణ
నోర్వవలె? హత్యఁజేసికొన బుద్ధ్యఁగఁ దిట్టరె రామచంద్రునిన్.

ఈకారణముచేతను, భర్త్రాజ్ఞావశవర్తిని నగుటచేతను నాత్మహత్య నొనర్చుకొనఁగూడ స్వాతంత్ర్యము లేదయ్యెను. కావున నీగర్భస్థశిశువులు జనించునంతవఱకు ననవరతశ్రీరామచంద్రధ్యానతరణి నీదుఃఖజలధిఁ దరింపనెంతు.

లః- జననీ! క్రూరకర్ముం డగునీలక్ష్మణునకు సెలవొసంగెదవా ? సత్వరమ తిరిగి రమ్మనిన రామచంద్రవాక్యోల్లంఘనముఁ జేసినవాఁడ నగుదునేమో యని భయపడుచున్నాఁడ.

జా:- వత్సా ! నాయీవాక్యములఁ బ్రాణనాథునితోడను, బరమపూజ్యలగు నత్తలతోడను నామాటుగాఁ బ్రణమిల్లి విన్నవింపుము.

సీ. సాధ్వియైనను ధరాజననిందఁ బడినట్టిపుడమిపుట్టువు మిమ్ము నడిగె ననుమి
దూషిత జానకి తొలఁగెను రవివంశ మకళంక మొనరింపు మంటి ననుమి

నిరతంబు ఋషిపత్నుల స్మరియింతు ననుచు మామయత్తలతోడ నే నంటిననుమి
విడక నావెంట నెప్పుడుంజేరి ముదమిచ్చు బుడుతలందలంచి చేడ్పడితిననుమి

గీ. ప్రజల సుతులట్లు గనుమని ప్రాణపతికిఁ
దప్పులను సైచుఁడంచు నత్తలకు, నన్నుఁ
దలఁపకుఁడటంచు మఱఁదిమల్లలకు, డిందు
పడకుఁ డంచుఁ జెల్లెండ్రకు నుడువు మయ్య.

గీ. నన్ను జననిందకై కాననంబునందు
విడిచినను దమధ్యానము విడువ ననుచుఁ
బ్రాణ ముండఁగఁ దమపూజఁ బాయననుచు
స్పష్టముగఁ జెప్పుమా రామచంద్రుతోడ !

ల:- జననీ ! నీపల్కులెల్లఁ బూసగ్రుచ్చిన ట్లగ్రజునకుఁ, దల్లులకు, సోదరులకు మీచెల్లెండ్రకు వచింతు. ఇక నా కాజ్ఞయీఁడు. పోయివచ్చెద. (ప్రదక్షిణ నమస్కారముఁ జేయును.)

జా:- సౌమిత్రీ ! దీర్ఘాయుష్మాన్ భవ.

ల:- ఓపంచభూతములారా ! సూర్యచంద్రులారా ! తపోవన సంచారులారా !

చ. ధరణిజ, రాఘువార్థమును, దప్పగరానిమదగ్రజన్ముని
ఘోరమగుశాసనంబున నిటు ల్వనభూముల డించిపోవుని
షకరుణుఁడ నైననానుడులఁ గాదన కీమె దయార్ద్రదృష్టి నె
త్తెఱఁగున మీరుప్రోతురో, సతీభరణంబు మహాపవిత్రమౌ.
(నిష్క్రమించును)

జా:- అక్కటా ! లక్ష్మణుఁడుకూడఁ గరుణమాలి నన్నొంటిగ విడిచి పోయెను. పాప మాతఁ డేమిచేయఁగలఁడు, రాజాజ్ఞావశవర్తి ? ఇఁక నాకు దిక్కెవ్వరు ?

ఉ. పుట్టినదాది భూజననిమోము నెఱుంగను, లేడిఁ గోరఁగా
నట్టడవి న్నను న్విడిచె నాథుఁడు, దుండుడుకైనవాణిచేఁ

జెట్టుల కాలవాలముగఁ జేసెను లక్ష్మణుఁ డప్పు, వాడు చే
నిట్టులనైతి, నేమిటికి నీయధమాధమజీవనం బిలన్.

హా ! శ్రీరామచంద్రా ! (మూర్ఛిల్లును. ఇరువురు మునిబాల
కులు ప్రవేశింతురు)

1 ము. బా:- విశారదా ! మెఱుపుతీవవంటి యీామె యెవరోయింత
కుముం దాక్రిందన మొనరించి నిశ్చేష్టయై పడియున్నది.

2 ము. బా:- గాలవా ! అవునురా. ఇచ్చట నెవ్వరు లేరు. ఈమె
పూర్తిగా మూర్ఛిల్లినది. మన మాలస్యముఁ జేసిన లాభము లేదు.
గురువులవారి కెఱింగింతము పద.

1 ము. బా:- సరియే పోవుదము. (నిష్క్రమింతురు)

వాల్మీకి:- (సత్వరమ ప్రవేశించి నలువైపులు పరికించి) ఏది విశారద
గాలవులు వచించిన యాకోమలాంగి ? ఎవరై యుండును ? (ధ్యా
నము నభినయించి) అదిగో యాచెట్టుక్రింద నిప్పుడిప్పుడే కదలు
చున్నది. మూర్ఛనుండి తేఱుచున్నది కాఁబోలు ! (జానకిని
సమీపించి) సుతా ! జానకీ ! లెమ్ము. నేను వాల్మీకిని.

చ. అనఘచరిత్రి ! యీవిషయమంతయుఁ గాంచితి దివ్యదృష్టిచే
మనమున ఖేదమొందకుము, మత్సుతతుల్యగ నిన్నుఁ గాంతు నీ
వనమున నే మదాశ్రమము పావితమునందె, సమస్తసౌఖ్యముల్
తనయరో ! కూర్తు నీ కచట ...

జా:- ... ధన్యను, సంయమిచంద్ర ! మీకృపన్.

ఇట్టియసహాయస్థితి నున్న నాపై నవ్యాజానురాగమునఁ దమ
యాశ్రమంబున నాకు సర్వవసతులఁ జేకూర్తునని యభయ
మిచ్చుటచే మీరలు నాతండ్రినిగూడ మించితిరి. తమయిచ్చ
మెలంగ సంసిద్ధను.

వా:- మునిపత్నులారా ! ఇటు రండు, (ఇరువురు మునిపత్నులు ప్ర
వేశింతురు) అమ్మలారా !

ఉ. ఈసతి, రామచంద్రధరణీశ్వరుపత్నిని, గర్భిణి, స్నేహా
యాసపరీవృతాత్మను, నిజాత్మజకుంబలెనే సపర్యలా
జేసి మదీయదీవనలఁ జెంగుఁ డనాథలఁ బ్రోచిమివారికే
యాసరసీజనాభుఁ డిడునంచు నెఱుంగరె నిత్యసౌఖ్యముల్ ?

మునిపత్నులుః- జనకా! మీయాజ్ఞానుసారమే. (జానకినిజేర్చి) తల్లీ! ఇటు. ఇటు. (ఇరువురుమునిపత్నులు తోడ్కొనిపోవఁజూప జానకి నిష్క్రమించును. తెర జాఱును)

(తెరలో)

గీ. జానకీదేవి ప్రసవించి సన్ముహూర్త
మునను గవలను గనుటచే మోదముఁగని
పుట్టపుట్టువు, వారికిఁ బోలు ననుచుఁ
గుశలవులనుచు నామము ల్గూర్చె ; బళిర !



# శ్రీ రామ ప్రస్థానము



## తృతీయాంకము



అయోధ్యాపురి - శ్రీరామరాజహర్మ్యద్వారము.

[మృతపుత్రకళేబరము నెత్తికొని యొక బ్రాహ్మణుఁడు ప్రవేశించును]

బ్రా:- ఆ. అక్కటక్కటకట! ఆశ్చర్య మారయ
విధికృతంబు నాదు వెంట నంటె
రమ్యమూర్తి నాదు రంగగు పుత్రుఁడు
చచ్చువెల్ల నదియు స్వామికృతియె.

(దింపి పరుండఁబెట్టి) కొడుకా! నీ కింతలోనే నూరేండ్లు నిండెనా? నాయనా! సరిగాఁ బదునాల్గేండ్లు నిండలేదే తండ్రీ! ఇంతలోనే యమపురిఁ గనఁబోయితివా? పుట్టినదాది యసత్యసంభాషణముగాని యధర్మమార్గవర్తనముగాని యెఱుంగని నాకీ పుత్రశోకము కలుగనేల? తండ్రీ! పెద్దవాఁడవై మా కిన్నితిలోదకంబు లిత్తువని గంపెఁడాసతో నున్నమాయాశలనెల్ల నిరాశలఁ జేసి కన్నుమూసితివా? అబ్బా! అబ్బా! నీవియోగదుఃఖమును నీజననీజనకులు భరింపఁజాలరు. భరింపఁజాలరు. అనవరతము నావెంటవెంటఁ దిరుగుసద్గుణఖని వగునిన్నుఁ బాసి యిఁక నొకనిమిషమైన మనఁజాల. (మొగముఁ జేతులతో మోఁదుకొనుచు) ఏపాప మెఱుఁగనిపసివాఁడ వగునీవును, నేదోసమెఱుఁగని ముసలినగు నేనును నివ్విధి నగుటకు గుప్తమగుకారణ మేదో యుండ

వలయును. ఏరాజురాజ్యమునందు నిట్టిమరణశోకము వినంబడుట లేదే! ఇది యీరామచంద్రునిరాజ్యమునకే పట్టినదా? నేఁడు నావంతే వచ్చినదా! కటకటా! (పండ్లు పటపటఁ గొఱుకుచు) 'రాజా రాష్ట్రకృతమ్ పాపమ్' అనునార్యోక్తినిఁబట్టి యివియెల్ల రాజకృతపాపఫలమే. నిస్సంశయము. నిస్సంశయము. ఓ శ్రీరామచంద్ర ప్రభూ!

శ్రీరాముఁడు:- (ప్రవేశించి స్వగతము) ఎవ రీవిప్రుఁ డిట్లు గోలపెట్టుచున్నాఁడు. మృతకళేబరముకూడ నున్నదే? విచారించెద. (ప్రకాశముగా) భూసురవర్యా! అభివాదనములు.

బ్రా:- ప్రభూ! మీయజ్ఞాతాజ్ఞాతదోషంబుననో నాసుతుఁడు మృత్యువువాతఁబడె. ఇఁక మీరాజ్యమునం దుండుజనులకు మృత్యుభయము ప్రత్యక్షముగఁ దోఁచుచున్నది. నగరములఁగాని, జనపదంబులఁగాని జరుగునధర్మంబుల వారింపకుండుట రాజదోషము. అది యేదేని యాపాదించి యీనాచిన్నికుఱ్ఱని మృత్యురూపంబునఁ గొనిపోయి యుండనోపు. నా కీతఁ డేకపుత్రుఁడు. వీనిని మీరు బ్రదికించి నాకీయరేని యీరాజద్వారముననే తల బ్రద్దలు చేసికొని మృతిఁజెందెద. ఈబ్రహ్మహత్య మీకుఁ దప్పదు. ఇందు నాసుతుని నాకు బ్రదికించి (అని రామచంద్రుని కడ్డముగఁ జతికిలఁబడును)

శ్రీ:- విప్రవర్యా! త్వరపడకుఁడు. త్వరపడకుఁడు. నిదానింపుఁడు. నిదానింపుఁడు. సౌఖ్యము వచ్చినతఱి మిన్నంటుటయు, దుఃఖసమయంబునఁ బాతాళమునకుఁ గ్రుంగుటయు ధీమంతులలక్షణములా! ఈబాలుఁడు నాపాపఫలంబుననే మృతిఁజెందినఁ బ్రయత్నమున నాతని బ్రదికింప యత్నించెద. కొంచె మోపికపట్టుఁడు. సౌమిత్రీ! (లక్ష్మణుఁడు ప్రవేశించును)

ల:- (నమస్కరించి లేచును)

శ్రీ:- దీర్ఘాయుష్మాన్ భవ. తమ్ముఁడా! గురువర్యు నొకపరి దయచేయుఁడని నామనవిగ విన్నవించి పిలుచుకొనిరమ్ము.

ల:- మహాప్రసాదము. (నిష్క్రమించును)

శ్రీ:- (స్వగతము) ఏమి ఈ బ్రాహ్మణబాలుని యకాలమరణమునకుం గారణము ? స్ఫురింపకున్నది. (కొంచెము యూరకుండి) ఏమియుం దోఁచుట లేదు. అయిన నిది యుండునా ?

మ. దయయు న్స్నానకృతశౌచముల్ దొఱఁగియు న్దక్షాధ్వరధ్వంసిని
న్నియమంబొప్ప దినంబుఁ గొల్చునసురు న్నీచాత్ముఁగా నెంచి దు
ష్క్రియ నాజన్మ్బరిగొంటి బ్రాహ్మణుని,నాకీ డిట్టిరూపొంది యీ
క్రియ నీబాలకుఁ జంపెనో యిఁక మఱేరీతి న్విజృంభించునో ?

అగ్ని కాన్పించినవెంటనే చల్లార్పకుండిన జగత్ప్రళయం బొనగూర్పకుండునా ? ఈ బ్రాహ్మణబాలుని యకాలమరణము నకుఁ గతంబు మున్ముం దెఱింగి దానికి నిష్కృతి యొనగూర్ప యత్నించెద. గురువులవా రింకను రాకున్నా రేమి ?

లక్ష్మ:- (ప్రవేశించి) మహాప్రభూ ! గురువర్యులు వచ్చియున్నారలు.

శ్రీ:- వత్సా ! తక్షణమ ప్రవేశపెట్టుము.

ల:- (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) గురువర్యా ! ఇటు. ఇటు. (అని ముందు త్రోవఁజూపును)

వశిష్ఠుఁడు:- (ప్రవేశించును)

శ్రీ:- గురువర్యా ! అభివాదనము (నమస్కరించును)

వ:- దీర్ఘాయుష్మాన్ భవ. వత్సా ! లెమ్ము.

శ్రీ:- (లేచును) ఈయాసనము నలంకరింపుఁడు.

వ:- (ఉచితాసనాసీనుఁడై) శ్రీరామా ! ఏల పిలిపించితివి !

శ్రీ:- గురువర్యా ! అవధారు.

చ. అలబలమొల్లెడ న్గొలుపునట్టిదికాదొకో మృత్యుహస్త, మా
కలుషమదీయరాజ్యమునఁ గన్పడకుండుట నింతదనుకఁ జే
రెలమి సుఖంచుచుండెఁ బ్రజ;యేమినిమిత్తమొ బ్రాహ్మణార్భకు
న్దొలికడి మిత్తిచేసికొ న,దుఃఖముఁ జెందెడిఁ బాటుఁ డోగురూ!

దీనికిఁ గారణ మేమైయుండును ? ఈ బ్రాహ్మణబాలుఁడు బ్రదుకు నుపాయ మేమి ?

వః- (యోజించుచుండును) (తెరలో)

రమ. సకలదనుజహర! జనవినుతసుయశ!
సనకహృదయజలజనట! హరీ!
యకలుషహృదయ! సహజసుగుణనిలయ!
యజవినమితపద! యమలకృపా!

శ్రీః- (శ్రుతిసుఖ మభినయించుచు)

గీ. బ్రాహ్మణునిపుత్రశోకదవానలమునఁ
బడినయట్టినాహృదయతాపంబు వాప
నమృతధారానుకారి యైనట్టియిట్టి
గాన మది నారమునిదెకా! మౌనివర్య!

వః- ఇంకను సందియమా! నిక్కముగ నిది బ్రహ్మమానసపుత్రుని మహతీస్వనమే.

లః- అగ్రజా! అదుగో వారలే సాక్షాత్కరించుచున్నారు.

(నారదుఁడు ప్రవేశించును)

నాః- (కనుల విచ్చి) ఏమిది క్షణమాత్రమున సాకేతముఁ జేరితిని. (ఇదుగో శ్రీరామచంద్రమూర్తి సాక్షాత్కరించుచున్నాఁడు).

రమ. ప్రకటితశమదమ! భవహననచణసుపద!
నతిఁగయికొను! వరసుగుణా!
సుకృతనిలయ! మునిసుదతియఘహరణ!
సురనికరవినుత! శుభచరితా!

శ్రీ, లః- (నమస్కరింతురు.)

నాః- దీర్ఘాయుష్మంతౌ భవతం. ఈప్సితార్థ సిద్ధిరస్తు. శ్రీరామలక్ష్మణులారా! లెండు.

శ్రీ, లః- (లేచి చేతులు కట్టుకొని నిలువఁబడియుందురు) మునివర్యులీయాసన మలంకరింతురుగాక.

నాః- (ఆసీనుఁడై) రఘుకులాబ్ధిరాకాశశాంకా!

క. శారదరాజున కైనను
గోరంత కళంకుఁజూపు కువలయమిత్రా!
నీశేజవైరివదనా!
యీరీతి న్గుందఁ గత మదేమో చెపుమీ.

శ్రీ:- దేవర్షిపుంగవా! మీరు సమయసహాయుల రగుమహానుభావు లరుకదా? ఏమని చెప్పుకుందు! ఆపుత్రశోకాతురుఁ డగుబ్రాహ్మణునిఁ దిలకింపుఁడు.

ఉ. వత్సవిహీనగోవ్రుగతి వందఁరుచు న్ఘనశోకమెల్ల బీ
భత్సతఁ దాల్పఁగా సుతుని ప్రాణము లీయవయేని దెంపున
న్మత్సరమూని చత్తునని; మానివరా! యెటువోత్తు నయ్య! యా
పత్సమయంబు, నన్నిఁటు కృపాపరత న్భరియించి ప్రోచెదో?

నా:- వశిష్ఠమహర్షీ! ఏమియుపాయముఁ జేయుదము?

వ:- త్రిలోకసంచారీ! బ్రహ్మమానసపుత్రా! తా మెఱుఁగనియర్థ మేమికలదు?

నా:- (కొంచెము యోజించి) శ్రీరామచంద్రా! కృతయుగంబునఁ దపశ్శక్తి బ్రాహ్మణుల నాశ్రయించె. త్రేతాయుగంబున నయ్యది క్షత్రియులకు సంక్రమించె. ద్వాపరంబుల నది త్రైవర్ణికులసొమ్మయ్యె. ఇట్టియుగంబునఁ గాలధర్మము నతిక్రమించి యేపాదజుఁడో తపం బాచరింపఁ బూనియుండనోపు. ప్రజారక్షార్థమై వారినుండి యాఱవవంతు ఫలితమును గ్రహించురాజు లోకంబు ధర్మానుసారంబుగ శాసింపవలసినవాఁ డూరకుండిన నిట్టిచెట్టలు కలుగుచుండును. అట్టివానిని శాసించినఁగాని శుభము కలుగదు. ఇదియే కారణమని నాయుద్దేశము.

బ్రా:- రామచంద్రా! మీగుసగుసలతోఁ బ్రొద్దుపోవుచున్నది. నా గతి నేమిచెప్పెదవు? నే నీపుత్రశోకమును భరింపఁజాలను.

గీ. ఇంతకును బూర్ణముగను గృతాంతుపురముఁ
జేరియుండఁడు నాకుఱ్ఱ, భూరమణుఁడ

వీని నీ విడ్డు బ్రదికింపవేని, శిరము
బ్రద్ద లొనరించుకొని చేరువాఁడ వాని.

శ్రీ:- భూసురవర్యా! కొంచెము శాంతింపుఁడు. శాంతింపుఁడు. మీరు చూచుచున్నారలుకదా ? నే నీకారణాన్వేషణముననే యుంటిని గదా ? ఈదేవర్షివర్యుఁ డేదో యొకమార్గముఁ జూపినాఁడు. దాని ననుసరించి నీపుత్రుని బ్రదికించుయత్నముఁజేయ నిప్పుడే బయలు దేరుచున్నాఁడను. లక్ష్మణా! ఈబాలుని కళేబరమును సుగంధ తైలంబున నుంచునట్లుచేయుము. (వశిష్ఠ, నారద, భూసురులకు నమస్కరించి) పూజ్యులారా! నన్నాశీర్వదింపుఁడు. మీయాశీః ప్రభావంబునఁ గార్యసాధకుఁడనై రాఁగలను.

వ:- వాంఛితార్థఫలసిద్ధి రస్తు.

నా, భూ:- తథాస్తు.

శ్రీ:- (స్వగతము) ఈకళేబరము తైలమందుమాత్ర మెన్నిరోజు లుండఁగలదు ? నేను రాష్ట్రప్రదక్షిణము సత్వరమ చేసిరావల యును. ఏది యుపాయము! (యోజించి) ఆ. స్ఫురించినది. లంక నుండి యయోధ్యకు దివసమాత్రంబున నన్ను ససైన్యముగఁ జేర్చిన కౌబేరపుష్పక మున్నదికదా ? ఇఁక యోజనయేల ? ఆకసంబునఁ గామరూపిణివై చరించుచు నేఁగోరినఁ దక్షణము వత్తునని యనుజ్ఞ వడసి యేగినకౌబేరపుష్పకమును స్మరించెద. (ఆకసమువంకఁ గృతాంజలివై)

గీ. వేడ్కఁ జరియించుటకుఁగాక విప్రబాలు
మరణకారణ మరయ భూమండలంబు
త్వరితగతి సంచరింపఁగఁ దలఁచినాడు
స్వాంత మెటఁగి కౌబేరపుష్పకమ ! రమ్ము.

(తెరలో విమానము వచ్చినిలుచుశబ్ద మగును)

ధర్మరక్షాబద్ధకంకణా! రామచంద్రప్రభూ! నేను దమ యిచ్ఛామాత్రమున నేతెంచిన కౌబేరపుష్పకమును.

గీ. భోగనిరతుఁ గుబేరుని, బుద్ధిజాడ్య
జనితమోహాంధ రావణదనుజకొలువుఁ
బాయుటనెకదా మీభోటిభవ్యసేవ
బ్రాహ్మణునికిపై వినియోగపడుట కలిగె ?

శ్రీః- కౌబేరపుష్పకమా! వచ్చితివా! చాలసంతసము. పెద్దలచే ననుజ్ఞాతుండైన యీరాముని( గొనిపోవ సిద్ధముగ నున్నావా ?

(తెరలో) ప్రభూ ! చిత్తము.

లః- పుష్పకమా ! నీవు పరమధన్యవు. ఏలన

చ. హరిని వియత్పథంబున రయంబున మోయఁగ నైనతేయుఁడు
న్నరవరు రామచంద్రుఁ గదనంబునఁ దాల్పఁగ వాయుపుత్రుఁ డే
కరణి సువాహనక్రియను గ్రాలిరొ యట్టులె భూసురార్థమై
ధరఁ జరియించురామనృపుఁ దాల్చుట ధన్యవు ధన్య విద్ధరన్.

(తెరలో) తథాస్తు. తథాస్తు. తథాస్తు.

శ్రీః- అరుగో దేవతలు తథాస్తనుచుఁ గౌబేరపుష్పకమును ధన్యవని యుగ్గడించుచున్నారు. అట్టిధన్య నధిరోహించి పోవుకార్యము కూడ ధన్యముకా కెట్లుండును ? నేను సత్వరము బయలుదేరవలయును. పెద్దలచే నిప్పటికే యనుజ్ఞాతుఁడ ఇఁక నాకడ్డేమి కలదు? (సత్వరముగఁ బోవుచు) మఱచితిని. లక్ష్మణా ! ఆబ్రాహ్మణ బాలుని శరీరక్షేమము సకలభాండాగారముల కననేల రఘువంశ క్షేమమూలబంధము. జాగ్రత్త.

మహాప్రసాదము. అగ్రజునాజ్ఞ నప్రమత్తుఁడ.

(శ్రీరాముఁడు రయమునఁ దెరలోనికి నిష్క్రమించును. తెర యెత్తఁబడఁ బుష్పకాసీనుఁడై కృపాణధనుర్బాణపాణియై శ్రీరాముఁ డుండును)

శ్రీః- చ. అరసితి నాహిమాచలమునాదటిరాష్ట్రము నెల్ల, నిందుద్రి
క్తతరదీక్షతో నెమకి యుస్సురుమం చరుదెంచితిన్ మునీ

శ్వరువచనానుసార మొకపాదజుఁడేని దపోనిరూఢుఁడౌ
తెరువును గాన కిట్లరుగుదెంచితి యామ్యదిశ న్జరింపఁగన్.

ఇచ్చటను నెల్లెడల నరసితిఁగాని యట్టివాని నెచ్చోటను బొడఁగాంచనైతిని. ఏమి యీవిచిత్రము! బ్రహ్మమానసపుత్రుఁడును, దివ్యజ్ఞానయుక్తుండును, త్రిలోకసంచారియునగు నారద మునీంద్రువాక్యము లే దబ్బరయగునా? కాదు. కాదు. ముమ్మాటికిని గాదు. లోకమున నల్పజ్ఞులు తమబుద్ధిలోపంబున మహా మహులయింగితము గ్రహింపనేరక తమబుద్ధిలోపము వారి కాపాదించి దూషించుచుందురు. ఆమహాత్ముఁ డసత్యవాఁడునా? ఆడ వలసినంత యేమిపుట్టిమునిఁగె? ఏమియును లేదే? వారిని బుష్ప కమునఁ దీసికొనివచ్చినఁ జాలబాగుండెడిది. గతజలసేతుబంధన మేల? కావున నిది నాలోపమే. ఈకసంబమునైనలాచలప్రాంత మునఁగూడ వెదకి మరలిచని వారినే వెంటఁగొనివచ్చి కార్యము సాధించెద. కార్యసాధకులపట్ల నభిమాన మసమంజసము, వినయ మత్యవసరము. (పుష్పకము దిగి పరిక్రమించఁగాఁ దెర లేవ సరోవరము కానుపించును.) ఏమి యిది సరోవరమా, శోణహ్రదమా!

చ. జనపతివయ్యు దుర్జనులజాడ గ్రహింపఁగలేక సత్తపో
ధనులయమోఘవాక్కు లనృతంబు లటంచును సంశయింతె?
నిక్కనుకను జూచుసూర్యకను కెంపుసరోవరవారి శోణము [య
న్నొప్పనరుచుచు స్థలుం డిటకుఁబొంతనెయుండుటసుంత తెల్పెడిన్.

ఈప్రాంతమునఁగూడ నెమకెద. (ఇంచుక పరిక్రమించి యాశ్చర్య మభినయించుచు) ఏమీ యిచ్చట నెవరో తపోధనుఁ డున్నట్లున్నాఁడే? (నిదానించి చూచుచు) ఎవరో యొకతపస్వి యిట నధోముఖుఁడై తప మాచరించుచున్నాఁడు. ఇది నారద వాక్యానుగుణముగనే కనుపట్టుచున్నది. కార్యాతురులకు శాంత మునకు హస్తిమశకాంతరము. త్వరపడరాదు. ఆతురతామహా గజమును క్షమాంకుశముననే మరల్పవలయును. అగుసుగాని యట్లనుకొని యత్యాలస్యముచేఁ గార్యభంగముమాత్ర మొనర్పఁ

బాడికాదు. తపోజనతాత్రిత యగు రాముఁడే తపోభంగ మొనరింప నుంకించుటయా? ఏమీ తపోభంగభ్రమంబునఁ జిక్కి బ్రాహ్మణున కొనర్చినవాగ్దానమును మఱవకుమనియా యంతరాత్మ యుద్బోధించుచున్నది? అంతరాత్మా! చిన్నపుచ్చుకొనకుము. రాముఁడు నీయాజ్ఞ నెన్నఁడును మీఱువాఁడు కాఁడు.

గీ. సత్యపరినిష్ఠుఁ డగుహరిశ్చంద్రుఁబోలు
నిరతఋతవాది దశరథనృపతియడుగుఁ
దమ్ములపథంబునను బోవఁ దలఁచునాకు
విప్రహితమె విహితము పవిత్రతమము.

నే జంకఁ గారణ మావంతయును లేదు. (అధోముఖుఁడగుమునిని దరిసి)

చ. మునివర! యిట్టి ఘోరతపము నొ్బనరించెడినీదుకోరిక
న్వినవలతు న్వచింపఁగదె నిక్కము దాఁపక; భూసురుండవో?
జనపతివో? కొ? వైశ్యకులజాతుఁడవో? ఘనపాదజుండవో?
జనపతి నోటచే నెఱుఁగ సాహసము న్గొనినాఁడఁ దెల్పుఁడీ.

ము. రామచంద్రా! అనృతం బాడనేల? దేహంబుతో దేవత్వంబు నొందనెంచి యిట్టిఘోరతపం బొనరించుచున్నాఁడ. నేను శూద్రయోనిజుఁడ; శంబుకుఁ డనువాఁడ.

శ్రీ:- (మహోగ్రుఁడై) మహాత్మా! తమయాశయ మెంతయు శ్లాఘ్యమే కాని యుగధర్మానుసారము గామి ధర్మోద్ధరణాబద్ధకంకణుఁడై ధర్మమును శాసించుప్రభువునకు మిమ్ముబోంట్ల నీచంద్రహాసపుత్రికాపరిష్వంగమున స్వస్థులఁజేయక తప్పినదికాదు. యుగధర్మరక్షార్థమున మీరు దధీచితుల్యుల రగుటకు వెనుదీయక సిద్ధము గండు. (ఒఱనుండి చంద్రహాసముఁ బెఱికి)

గీ. తెఱల యుగహితధర్మము తపముసలుపు
శూద్రవరుఁ ద్రుంచి ధరణికి శోభనంబు
సలుపుమమ్మరో! జనహితాచరణచణత
చంద్రహాసమ! రిపుప్రాణశమనసమమ!

(చంద్రహాసమును బై కెత్తును. తెర వ్రాలును)

శ్రీ:- (కరధృతరక్తసిక్తచంద్రహాసుఁడై ప్రవేశించి పరికించి) ఏమి యీవిరులవాన! దేవదుందుభిస్వనము వినవచ్చెడిని. ఎవ రాయాకసమున విమానారూఢులై నిల్చినవారు ?

(తెరలో)

చ. జనవర! ధారుణీహితము సల్పఁగఁ బాదజుఁ జంపి ధర్మశా
సన మొనరించు నిన్నుఁ గన సంతసమయ్యె; వరంబు లీయవ[మీ
చ్చినమముఁ జూడు మే హితముచేఁ దనియంగఁ దలంపు? చెప్పు
మొనరుచు నిర్జరేంద్రుఁ డిపు డయ్యన! రామధరేశ్వరాగ్రణీ.

శ్రీ:- (స్వగతము) ఓహో! ఈయన దేవగణయుక్తుఁ డగుజంభారియా తన్నెఱింగించుకొనుచున్నాఁడు (ప్రకాశముగా) త్రివిష్టపేశ్వరా! నిర్జరులారా! రాఘవుఁ డగుశ్రీరాముఁడు వందనశతంబు లర్పించుచున్నాఁడు. స్వీకరింపుఁడు. దయామయులారా! ఒక్కనరునిఁ బెద్దఁజేసి పొగడ మొదలిడి నాకు వరము లిత్తుమని సంతుష్టిపరీక్ష నొనర్చెదరా? కానిండు. 'అసంతుష్టో ద్విజో నష్టః సంతుష్టః పార్థివోత్తమః' అనునది యార్థనవిషయములోఁ గాని యుట్టియెడఁ గాదు. మీయనుగ్రహంబున నాకేమిటఁ గొదువ లేదు. అయినను దేవతలు వరము లిచ్చెదమనినఁ గాదను టసమంజసము కావునను మృతుఁడైనవిప్రబాలుని బ్రదికించి వాని జనకున కొసంగెదనని వాగ్దానముఁ జేసితిఁ గాన నాబాలుని బ్రదికించుటే నాకు వరము. దాని ననుగ్రహింపుఁడు.

(తెరలో) పరోపకారపారీణా! శ్రీరామచంద్రా!

చ. వరములఁ గోరుకొమ్మనిన వానిని గాదని బ్రాహ్మణార్భకు
న్మరణముఁ గన్నవాని మనుమార్గముఁ జూపుటయే వరంబు నా
నరవర! పల్కుచుంటివి జనస్తవనీయచరిత్ర! మెప్పు చే
కురెను, జఘన్యుఁ జంపఁగనె కూడెను బ్రాణము విప్రబాలకున్.

అతఁడు జనకయుక్తుఁడై బంధువులఁ గలిసె. చింతవక్కి - సాకేతంబుఁ జేరుదము.

శ్రీ:- ధన్యోస్మి. ధన్యోస్మి. సురవరులారా! నాకింకేమి కావలయును? సురలదర్శనము సదా శుభకారియేకాక యేమగును ?

మ. విపరీతంపుతపంబుఁ జేయుకతన న్విప్రార్భకు న్జంపినాఁ
డు పదోద్భూతుఁడటంచుఁ జంపితిని మూఢున్బోలె నామానిపి
స్గ్రుపచేఁగాదో కా మిమ్ముఁగంటినిట, నార్తిన్బొందనా నవ్వనా!
యపకారం బుపకారసమ్మిళితమై యర్థంబె సూ ధాత్రిపై.

క. పాదజుఁ దునుముట విప్ర
మోదం బొనగూడె, దివిజముఖ్యులకృపయు
న్బ్రోది యొనర్పఁగఁ గలిగితి
మోదము చేకూరె, నాదుపుణ్య మలఁతియే ?

(తెరలో) రామచంద్రమూర్తీ! ఇఁక మాకు సెలవా ?

శ్రీ:- దివిజేంద్రా! సురలకు సురవిధేయునియనుజ్ఞతో నేమిపని ? మీచిత్తము (తెరలో) మేము పోయివత్తుము. అగస్త్యాశ్రమము మీఁదుగా సాకేతమార్గోన్ముఖుఁడ వగుట పరమ శ్రేయోదాయకము.

శ్రీ:- సురల యాజ్ఞ శిరసావహించుచున్నాఁడ. (తెర వ్రాలును)

(భరతలక్ష్మణు లాతురముతోఁ బ్రవేశింతురు)

భ:- తమ్ముఁడా! నీపలుకు లనృతములు కావుకదా? తైలఘటమున నుంచఁబడిన బ్రాహ్మణబాలుఁడేమి, సజీవుఁడై యాభాండమును వెలువడి పరుఁగిడివచ్చి వానితండ్రిని గలియుటేమి! నే నమ్మఁ జాలకున్నవాఁడ.

ల:- అగ్రజా! అంతసందియ మేల ? అదుగో యావిప్రుఁడు సుతుని గూడి రామధ్యాన మొనర్చుచుఁ బోవుచున్నాఁడు.

భ:- అనుజా! అగును. అతఁడు ధన్యుఁడు, మనము ధన్యులము.

ల:- అగ్రజా! ఇట్టివి సమ్మట విచిత్రమేకాని శ్రీరామచంద్రచరిత్రమునమాత్ర మిట్టి వ్రాకలెకా కాదు. దుర్ఘటకార్యము లాయన పాదధూళిచే సుఘటములగుట మనకుఁ గ్రొత్తలా ?

శా. కానన్పాదరజశ్చ్యుతిన్ శిలయె మున్గాంతాత్వమున్బొందదో
యేమూర్తిం గదల్చునాశివధను స్సేపాటును న్గాంచెనో ?
కానన్మున్బదునాల్గువేలదనుజు ల్గాలు న్గనంబోవరో ?
యీనాఁడీధరణీసురాత్మజువిధం బేమంత వైచిత్ర్యమే ?

నిగ్రహానుగ్రహసమర్థుఁడును సర్వశక్తిసమేతుఁడునగునగ్రజునిపట్ల నిది నా కంతటివిచిత్రమని తోఁచుటలేదుకాని "విత్తనములఁ దేఁబోయినరెడ్డి యోదె లెత్తునప్పటికిని రాలే"దనుసామెత మాత్రము జ్ఞప్తికి వచ్చి యగ్రజుఁ డింతయాలస్య మేలయొనర్చెనా యని సందియముపొడముచున్నది.

భ:- నాయనా ! పెద్దవాఁడవగుచున్నను నీ కింకను జిన్నతనము పూర్తిగఁ బోయినదికాదు. వా రేదో యనివార్యమగుకారణాంతరమున జాగుచేసియుందురేకాని బుద్ధిపూర్వకముగఁ జేయువారలా! పదునాల్గవవత్సరము గడచిన మఱుసటిదినము నే నగ్నిప్రదక్షిణము రెండవతూరి చేయునప్పటికి సరిగాఁ జేరునట్లు జగత్ప్రాణపుత్రునిఁ బుత్తెంచి నాప్రాణముల రక్షించి, యారీతిగనే తా నచ్చటనుండియే తనమహత్త్వముచేత విప్రబాలకు సజీవుఁగొనర్చిన యగ్రజుని సమయజ్ఞత నీ కేమితెలియును ? (వినుట నటించి అది పుష్పకవిమానశబ్దముకాదా ! వినుము.

ల:- అగ్రజా ! అగును. (ముందునకుఁ బరికించి) అదుగో యగ్రజుఁడు తనసహజరోచులకు మెఱుఁగుఁబెట్టునేదోభూషణభూషితుఁడై కూడ వచ్చుచున్నాఁడు. వారి నెదుర్కొందము. (భరతలక్ష్మణులు త్వరగా ముందునకు సాగుదురు. శ్రీరామచంద్రుఁ డెదుటినుండి ప్రవేశించును)

భ, ల:- శ్రీరామచంద్రమహాప్రభువునకు జై. మహారాజులకు భక్తులనుజు లభివాదన మొనర్చుచున్నారలు. (సాష్టాంగదండప్రణామ మొనర్తురు)

శ్రీ:- దీర్ఘాయుష్మంతౌ భవతం. తమ్ములారా ! ఆవిప్రబాలుని కళేబర మేది ?

లః- అగ్రజా! ఇంతకుముందే యాతఁడు నిదురమేల్కొనినవానివలె సజీవుఁడై వానితండ్రిఁ గదియవచ్చినంతనే యాతఁడును సంతసించి తమ్మెంతయో కీర్తించి వారిబంధువులకీశుభవార్త నెఱింగింపఁ బోవుచుఁ దమదర్శనము మరల వచ్చి చేయుదునని వెళ్ళినాఁడు.

శ్రీః- అనుజులారా! ఇప్పటికి మనము ధన్యులము. దక్షిణమున శైవలాచలప్రాంతంబున శంబుకుఁ డను నొకపాదజుఁడు తపంబుఁ జేయుటఁ గాంచి వానికంఠంబుఁ దునిమినంత వృత్రారిసమేతులై దేవతలెల్లరు నన్ను వరముల వేఁడుమనిరి. నేను భూసురబాలకుని సజీవునిజేయుటయే వరమంటిని వారు వల్లెయని నన్నాశీర్వదించి పోయిరి. అందుచేతనే యావిప్రబాలకుఁడు బ్రదికినది.

భ, లః- ఆహా! ఎంతటి ధన్యులము!

శ్రీః- తమ్ములారా! అగును. (ఉచితాసనాసీను లగుదురు)

లః- అగ్రజా! ఈమణి క్రొత్తగ నున్నదే?

శ్రీః- తమ్ములారా! అగును. సురపతియాజ్ఞానుసార మగస్త్యాశ్రమము మీఁదుగా వచ్చుచు నయ్యనఘుని దర్శింపఁబోవ నమ్మహాత్ముఁడు బ్రహ్మలోకంబుఁ జెందినను, దన యదత్తదోషంబునను, నిరత స్వకాయపోషణంబునను, నిజశరీరమాంసము భక్షించుచుండిన శ్వేతుఁడు తన కొసంగుటచే ముక్తిఁ గాంచెననియు, నట్టిరత్నంబు ధరింప నేన యర్హుండ నని చెప్పుచు దానపరిగ్రహణంబునకు వెనుదీయుచున్న నన్నాఖండలునంశమున రాజులు పరిగ్రహింపవచ్చునని నచ్చఁజెప్పి యొసంగె. అదియే యిది. చూడుఁడు. (లక్ష్మణుని చేతి కిచ్చును. భరతలక్ష్మణులు పరీక్షించి)

భః- అగ్రజా! చాల రమణీయముగ నున్నది. మహారాజశిరోరత్నము లగుదేవరవారిఁ జేరుట నీరత్నము రత్నశిరోరత్నమైనది.

శ్రీః- అనుజులారా! నిర్వక్రపరాక్రములగు మీరు మీదోస్సారంబు మెఱయింప రాజసూయంబుఁ జేయవలయునని బుద్ధి వొడముచున్నది. మీయభిప్రాయ మేమి?

భ:- అగ్రజా ! తా నొకప్రశ్న యడుగఁబడినప్పుడు తనయెఱిఁగినంత పలుకు మొగమోటమునఁ జెప్పకుండుట ధర్మజ్ఞులలక్షణము కాదు. రాజసూయము రాజలోకమున కసూయాసంధాయకము. దానిచే నది వేయుచెట్టుల కాలవాలమగును. జనానురంజకుఁ డగురాజున కది హితమైనపవనము కాదు.

శ్రీ:- అనుజా ! నీవాక్కుల కెంతయు నలరితి. పిన్నయైనను పథ్యమగుహితము చెప్పిన వయోవృద్ధులైనను గ్రహింపఁజనును. అట్టి జన్నము సలుపుతలఁపు విడిచితి.

ల:- అగ్రజా !

ఉ. వృత్రవధాఘ మింద్రు ముఱువేఁచఁగ దానిని బాయుత్రోవ, లో
కత్రయనాథుఁ డౌ హరినిఁ గాంచఁగఁబోయి సురాళి వేఁడఁ, దా
పత్రయహారియానతఁడు వాజిమఖంబును జేయుమం చనెన్
క్షత్రియవంశమండన ! విచార మిఁ కేల యొనర్పు మశ్వధిన్.

ఇది సర్వాఘంబులఁ బాపి శాశ్వతసుఖంబును సర్వాభీష్టంబుల నొసంగుఁగదా ?

శ్రీ:- తమ్ముఁడా ! కడుసమయజ్ఞుఁడవు. కర్తవ్యమును జక్కఁగ బోధించితివి. అగును. దీనినిఁ జేసియే బుధుఁ డిలునకు శాశ్వతపురుషత్వముఁ గలిగించెను. అయిన దానినే చేయసంకల్పించితి. రేపట నీవిషయము గురువులవారితో యోజించుదము. నేఁటికి మీ రేగుఁడు.

భ, ల.- చిత్తము. (నమస్కరింతురు)

శ్రీ:- దీర్ఘాయుష్మంతౌ భవతం. (భరతలక్ష్మణులు నిష్క్రమించఁగా నిట్టూర్పు నిగుడ్చుచు) అశ్వమేధంబుఁ దలపెట్టితిఁగదా? అయ్యో! నాయర్ధాంగలక్ష్మి నాచెంత లేకపోయెఁగదా ? దాని నొనర్ప నే నెట్లర్హుఁడ నగుదును. ఆహా ! సుఖదినములారా ! నామనంబునకు రావలదు. రావలదనిన రాక యెట్లేఁగఁగలవు ? హా జానకీ ! నీ వదనచంద్రుఁడు నీగుణతారకలు నాహృత్పథంబును వీడి యెట్లేఁగఁగలవు ?

చ. మునివృషభుండు కౌశికుఁడు మున్ను చనంగ, సుమిత్రపట్టి నే
నును జనకక్షమాపతి కనుంగొనుచుండ సభం జొరంగ మె
చ్చినమదితోడ సిగ్గు నొకచెంతకుఁ ద్రోయుచు విల్లు వెళ్ళన
న్ననుఁ గనుగొన్న నీదుచిఱునవ్వు మొగం బెటువిస్మరించుదున్?

మ. పతివెంటన్ జనుదెంచు టే సతికి సంభావ్యం బటంచెంచి యం
చితమా భక్తిని నేను వత్తునను నాశీతాంశుబింబాస్య నో ద్రా
యతివా! బాములుకల్గుఁ గాన నన, నాయుల్లుండు పుంరూపుఁ
యతివాయంచను నాదుతండ్రి' యనునాయర్ధాంగిఁ జింతించెదన్

ఉ. కాపుగ లక్ష్మణు న్నిలిపి, క్రొచ్చఱ నే ఖరదూషణాదుల
న్మాపఱఁజేయఁగాఁ జని కనుంగొనుచుండ నెదిర్చి దీర్ఘని
ద్రాపరుల న్బొనర్చినఁ గరం బలరారుచు నన్నుఁ గౌఁగిట
న్దేపకు గ్రుచ్చి నాఁటిసుదతీత్వము పుంస్త్వముఁగాంచె నంటివే.

శా. స్త్రీచాంచల్యముచేత లేడిఁ గొనఁగాఁ జింతించియు, న్దేవర
న్వాచాదోషముగాఁగఁ బల్కు ఫలము న్నారీ! కనుంగొంటిఁగా
దే చాతుర్యముచేత భక్తిగరిమ న్దేవి! నిను న్గాంచఁగా
నోచం డేమొకొ యీమహాఖలుఁ డిఁకెన్దున్గానియీకన్నులన్

మ. అనలంబందునఁ జొచ్చుమన్న సరియే యంచగ్నిలోఁ జొచ్చి వెం
టనె యేతెంచిన నన్ క్షమింపుమన విన్నాణంబుగా నాదుకీ
ర్తినిఁ బ్రోపించినపంకమెల్ల జ్వలదర్చి న్బాదిఁ గావించి తీ
వని నన్మెచ్చెడిసాధ్వి మైథిలితలం పయ్యారె! బాధించెడిన్.

అక్కటా! నే నెట్టిపాపకర్ముఁ డగుకఠినాత్ముఁడను! నేను బ్రస్తుత మొనర్చినకార్యమునుబట్టి న న్నే మనిపిలుచుకొనవలయునో నాకే తోఁచకున్నది?

చ. వన మలర, న్మునీశజనమండితరమ్యవనంబుల న్మెలం
గను వరమొందుగర్భవతిఁ గాఱులు ప్రేలినయేరిపల్కులో
విని, యడవి న్విడన్పనిచి వెంగలినైతిని, క్రూరకర్ముఁడం
చనరొకొ భూపతుల్! దనుప నందఱ నావిధికైన శక్యమే?

అర్ధాంగివిహీనుఁ డశ్వమేధం బెట్లొనర్పనగు ననుసందియ ముమాత్రము నను వేధించుచున్నది. గురువులవా రింకను రా కున్నారు. శాంతస్వరూపుఁ డగుభరతుఁ డూరకున్నను ద్వరితుఁ డగులక్ష్మణుఁ డూరకుండువాఁడు కాఁడే? ఏల జాగుచేసెనో తెలియకున్నది? (కన్నీరు కార్చుచు) హా జానకీ! కష్టసుఖముల నిన్నెన్నఁడును బాయనని యగ్నిసాక్షిగ శపథముఁజేసి విధిప్రతి కూల్యమునఁ దప్పక తప్పిన యీరాముని నీహృదయమునుండి విదల్చివేయకుము. సాధ్వీ! నీవ ట్లెన్నఁడును జేయవని లక్ష్మణ సందేశమునందలి యంత్యవాక్యమే తెలిపెను. దానఁ గొంత యూఱట కల్గినది.

ల:- (ప్రవేశించి)మహాప్రభువులకు సౌమిత్రి నమస్కరించుచున్నాఁడు

శ్రీ:- దీర్ఘాయుష్మాన్ భవ. సౌమిత్రీ! ఏల యింతతడవాయె? గురు వర్యు లేరీ?

ల:- ప్రభూ! వచ్చి హజారమున దమయాజ్ఞకై వేచియున్నారు.

శ్రీ:- వారలఁ దక్షణమ ప్రవేశపెట్టుము.

ల:- (నిష్క్రమించి ప్రవేశించును. వశిష్ఠభరతులు ప్రవేశింతురు) గురువర్యా! ఇటు. ఇటు. (త్రోవఁజూపును)

శ్రీ:- (ఆసనమునుండి లేచి) గురువర్యులకు రాఘవుఁ డగుశ్రీరాముఁ డభివాదనముఁ జేయుచున్నాఁడు. (నమస్కరించుచు) ఈయాసన మలంకరింపుఁడు.

వ:- దీర్ఘాయుష్మాన్ భవ. (శ్రీరాముఁడు వశిష్ఠపాదతలమునఁ బీఠ మునఁ గూరుచుండి యవనతవదనుఁడై యుండును)

గీ. అల్లహిమవన్నగాగ్రమునందునుండి
మట్టమధ్యాహ్నవేళఁ గన్పట్టఁ జాలుఁ
జాహ్నవినిఁబోలె నుష్ణబాష్పములు నీదు
గండములనుండి స్రవియించుకత మదేమి?

భ:- గురువర్యా ! మామాత యగు జానకీదేవిని బాసిననాఁటనుండి యీధైర్యహేమాద్రి గ్రీష్మహిమాద్రియగుచు దినదినప్రవర్ధమాన విరహదావానల దందహ్యామానధైర్యుండై యిట్లగుచున్నాఁడు.

వ:- రామచంద్రా ! లోకమున కాదర్శప్రాయుఁడ వగునీవే యిట్లు క్రుంగిన నిఁక నెట్లు? నీవిట్లు జానకిం దలఁచి వందురుచుంట లోకమెఱింగెనా వారిదృష్టిలో నీ వెంతలాఘువ మగుదువో యోజించితివా ? రామచంద్రుఁడు పండ్లభీకరంబునకు జనాపవాదభీరువై జానకిని విడనాఁడెఁగాని లోలోనమ్రగ్గుచున్నాఁడనియనుకొనరా? అట్లనుకొనిన నీయశస్సున కెంతభంగమో యొక్క పరి యోజించుకొనుము. వ్యసనబంధంబు ధైర్యలవిత్రమునఁద్రుంపఁగడంగుము లెమ్ము.

శ్రీ:- గురువర్యా ! చక్కనిహితంబు బోధించితిరి. అపగతవ్యసనుఁడనైతి.

వ:- శ్రీరామా ! నన్నుఁ బిలువఁబంపినకారణ వేమి ?

శ్రీ:- మనవిఁజేసికొనుచున్నాఁడను. అశ్వమేధయాగముఁ జేయ సంకల్పించి మీయనుజ్ఞవడయఁ బిలిపించితిని. అర్ధాంగీరహితుఁ డశ్వమేధ మెట్లుచేయనగునో సెలవిండు.

వ:- శుభస్య శీఘ్రమ్. ధర్మపత్ని చెంతలేనిచో స్వర్ణప్రతిమఁ జేసి ప్రాణప్రతిష్ఠ యొనర్చి సవనమునకుఁ గడఁగ నగు. రేపే సన్ముహూర్తము.

శ్రీ:- చిత్తము అనుజా ! లక్ష్మణా ! సర్వకపిభల్లుకసైన్యముతో రమ్మని సుగ్రీవునకు, సర్వరాక్షససైన్యములతో రమ్మని విభీషణునకు, సకుటుంబబాంధవులుగ రమ్మని సర్వదేశభూవరభూసురులకును దూతలఁ బుత్తెంచి గోమతీతీరంబున యజ్ఞవాటిక సిద్ధపఱపింపుము. అనుజా ! భరతా ! నీవును శత్రుఘ్నుఁడును సర్వులకనువగుగృహావసతులను, సర్వసంభారముల సిద్ధపఱపింపుఁడు

సవనయోగ్యాశ్వమును సేకరింపుఁడు. గురువర్యా ! సకలతాపసజనంబుల నాహ్వానమొనర్పఁ దామునిందుసహాయులరుకావలయును. ఎల్లి సుముహూర్తంబున కన్నియు సిద్ధముకావలయును.

భ,ల:- ప్రభుచిత్తానుసారమే. మాకు సెలవు. పోయివత్తుము. (నమస్కరింతురు)

శ్రీ:- సరియే.

భ,ల:- (నిష్క్రమింతురు)

వ:- శ్రీరామచంద్రా ! నీసంకల్పమునకు వికల్ప మెందైనఁ గలదా ? సర్వమునిబృంద మెల్లి సుముహూర్తమునకు వచ్చు నేర్పాటు చేయింతును.

శ్రీ:- చిత్తము. (నమస్కరించును)

వ:- దీర్ఘాయుష్మాన్ భవ.

(తెర వ్రాలును)



# శ్రీ రామ ప్రస్థానము

## చతుర్థాంకము

గోమతీతీరంబున నశ్వమేధయజ్ఞవాటిక.

(విష్ణుశర్మ పద్మనాభశర్మ యను నిరువురు విప్రులు ప్రవేశింతురు)

వి:- పద్మనాభా! ఎంతబాగుగ నున్నదో చూచితివా రామాశ్వమేధము?

ప:- అన్నా! చెప్ప నెవరివశము? ఇంద్రకుబేరాదిదేవాశ్వమేధంబులఁ జూచిన ఋషివర్యులే యవికూడ దీనినిఁ బోలవని యాదిశేషునట్లు వేనోళ్ళఁ బొగడుచుండ మనము పొగడుకొను టొకలెక్కా?

వి:- తమ్ముఁడా! అన్నిటిఁ జూచినవారలు కనుక వారలు తరతమంబులఁ బరిగణించుచున్నారలుకాని మనము చూచినది దశరథాశ్వమేధమును నిదియు నేకదా? దానికంటె నిది బాగుగ నుండలేదా?

ప:- అన్నా! దీన సందియ మేమున్నది? ఇంచుకయు లేదు. ఏమి వసతులు! ఏమి యుపచారవాక్యములు! ఏమి యపూపంబులు! ఏమి షడ్రసోపేతభోజనములు! ఆహాహా! తలఁచుకొనిన స్వర్గమున నున్నట్లున్నదికాని గోమతీతీరమున నున్న ట్లనిపించుటలేదు.

వి:- అగును దమ్ముఁడా! రాముని త్యాగమే త్యాగము. సకలరాజవర్గము తెచ్చియిచ్చినయుపాయనముల భూసురవర్యులకు ఋషివర్యుల కేవి కోరిన వాని నిమ్మని యొక్కఁడే యుత్తరు విచ్చినాఁడు

కదా. ఆహా! సబాంధవపరివారులగు భూసేతల పాదుల దీయి వారియవసరంబులఁగూర్ప నియమింపఁబడిన భరతశత్రుఘ్నులేమి, భూసురానీకంబుల కోర్కులఁ దీర్ప నియమింపఁబడిన సుగ్రీవవానరసైన్యమేమి, వృద్ధులను ఋషిజనంబులఁ బూజించి కాంక్షితంబు లొనగూర్ప ముదలయిడఁబడిన విభీషణ రాక్షసపరివార మేమి తక్కుంగల లెంకలేమి యెవ రేవ రడిగిన దానికంటె హెచ్చుగ నొసంగుచుఁ బరమసంతుష్టుల నొనర్చుచున్నారలు కదా! సరియైన ప్రభువునకు సరియైన సేవకులు దొరకుటయు నిరువురభాగ్యమే. ఏలయన నొసఁగుమనినవాఁ డొసంగుమనినను బిసినిగొట్టగుభటుఁ డేలికమెప్పువడయుటకో లేక తాను మిగిలించుకొనుతలంపుననో యజమానునిసొమ్మును సద్వినియోగము చేయుట మాని వానికిఁ గీర్తికి బదు లపకీర్తిని మూటఁగట్టుట సహజముకదా?

ప:- అన్నా! తఁగువారి నాయాకార్యముల నియమించుటనుబట్టి యట్టి విచ్చుటఁ బొరయుట లేదు. అంతయు సక్రమవినియోగ మగుచుండుటనుబట్టియు యజమానుఁ డిమ్మనినదానికంటె సేవకుఁ డెక్కుడుగ నొసంగుటచేత నాతనికి నస్థిరమగుకనకమును వెలపోసి స్థిరయశంబును విలుచుచున్నారు. అన్నా! లక్ష్మణుఁడు కాన్పించుట లేదే!

వి:- తమ్ముఁడా! ఆతఁడు సవనాశ్వమువెంట నంటి పోయినాఁడు. బళిబళీ! ఎచ్చటఁజూచినను - చాలు - చాలు- చాలు-చాలు- ననునినదమేతప్ప వేఱొండు వినంబడుట లేదు.

ప:- అన్నా! ఎవరో మనలఁ బిలుచుచున్నట్లున్నారు. (వినుటనటించి) "సుదర్శనావధాన్లుగారూ! ఏమనుచున్నారు. ఎవరో మునిబాలురు రామాయణగాన మొనర్పఁబోవుచున్నారు, రండనియా!" ఇదిగో వచ్చుచున్నాము. అన్నా! రామాయణగానము వినఁబోవుదమా?

వి:- తమ్ముఁడా! తప్పక పోవుదము. రామాయణము వినకుండుటకు మనచెవు లేమిపాపముఁ జేసికొనినవిరా? తప్పక పోవుదము. దారిఁదీయుము.

ప:- మెల్లగా రండు. ఇటు. ఇటు. (త్రోవఁజూపుచు విష్ణుశర్మ మెల్లగా ననుసరించును. తెర యెత్తఁబడును. శ్రీరాముఁడు సవన దీక్షావేషముతోఁ గూరుచుండియుండును. భరత, శత్రుఘ్న, సుగ్రీవ, విభీషణాంజనేయు లంజలిఘటించి నిలుచుండియుందురు. వశిష్ఠుఁ డుచితాసనాసీనుఁడై యుండును)

శ్రీ:- భరతా! ఇంతకుముందు ద్వారమున రామాయణము గాన మొనర్చుచుండిన బాలకుల నిటకుఁ దోడ్కొనిరమ్ము.

భ:- మహాప్రసాదము. (నిష్క్రమించి కుశలవసమేతముగాఁ బ్రవేశించి) మహాప్రభూ! ఆగాయకు లీబాలకులే.

శ్రీ:- (ఋషిబాలకులారా! దయచేయుఁడు. ఈకుశాస్తరణంబులఁ గూరుచుండి రామాయణగానముఁ జేయుఁడు. నే వినఁ గుతూహలుఁడనై యున్నవాఁడ.

కు,ల:- మహాప్రభువుల యాజ్ఞానుసారమే. (శ్రుతుల మేళవించి)

(పద్మనాభవిష్ణుశర్మలు ప్రవేశింతురు)

శ్రీ:- భూసురవరులారా! ఉచితాసనముపైఁ గూరుచుండి యీ బాలుర రామాయణగానము వినుఁడు.

ప, వి:- చిత్తము. మహాప్రసాదము. (చిత్రాసనములఁ గూరుచుందురు)

కు:- ద్వి. సరయూస్రవంతికి సామీప్యమునను
పరరాజహృదయము ల్పగులంగఁజేయు
ల:- సిరుల కాలయమౌచుఁ జెలువొప్పుచున్న
పురి యొండు సాకేతపురమన నొప్పు
కు:- దాని మున్నజుఁ డనుధరణీంద్రుఁ డేలె
వానికి దశరథవసుమతీవరుఁడు
ల:- జనియించె; నాతఁడు శౌర్యంబుపేర్మి
వనధిపరీతభూవలయము నేలి
కు:- ముగ్వురు సతులను బొంది వంశంబు
మవ్వముఁజేయుకుమారులఁ గనఁడు

ల:- తనయులు లేమిఁ జింతను బొక్కి పొక్కి
మనుజనాథుఁడు వేఁటమార్గంబుఁ దవిలి
కు:- పోయి గజంబని మునిబాలు నొకని
సాయకంబున వేసి చంప నబ్బాలు
ల:- తల్లిదండ్రులు, నల్లె దశరథనృపుఁడు
మల్లడిఁగొనుఁ బుత్రమణివియోగమున
కు:- ననుచును మడిసిరి; యందుల కతఁడు
కనె మోదమును బుత్రుఁ గాంతుఁగా యనుచు
ల:- ఆవల కొన్నాళ్ళ కవనీశమౌళి
పావనం బైనట్టివాజిమేధంబుఁ
కు:- బుత్రకామేష్టియుఁ బొలుపారఁ జేయుఁ
బుత్రదపాయసంబును భాండము నను
ల:- గొని తేర నగ్ని, చేకొని సతీత్రితయ
మున కొసంగిన గర్భములఁ దాల్చి వారు
కు:- రామలక్ష్మణుల భరతుని శత్రుఘ్ను
శ్రీమహోజ్జ్వలులఁ గాంచియు సంతసించి
ల:- యల్లారుముద్దుగా నమితమోదమునఁ
దల్లులు పెంచఁగాఁ దనయులు బలసి
కు:- సర్వవిద్యలయందుఁ జతురతఁ గల్గు
ధూర్వహు లగువారిఁ దుల్యకన్యకల
ల:- నరయుఁగ దశరథుం డనుకొనుచుండఁ
ద్వరఁ గౌశికుఁడు వచ్చి ధరణీశ ! నాకు
కు:- మూఁకలచే విఘ్నమును బొందు యజ్ఞ
మాకారణము చేత నలఘుఁడౌ రామ
ల:- చంద్రునిఁ బంపు దశరథమహీశ !
యింద్రుం డగచయంబు నేయువిధమునఁ
కు:- గూలుపఁగలఁ డీయకుంఠబలుండు
జాలమొనర్పకు జననాథ ! యనిన

లః- పుట్టకపుట్టక పుట్టినయట్టి
పట్టిని రాక్షసావళి నెదుర్పంగఁ

కుః- బంపనిచ్చయు లేక పరతాపసేంద్ర!
కొంపొమ్ము నన్నని కోరినయంత

లః- నావచనంబు ననాదరించెదవె
భూవర! యనుచును బోడమిసకినుకఁ

కుః- గటములదురఁగ దిక్తటములు మ్రోయఁ
బటుహుంకృతిని రాజవరుఁజూచి యనియె.

శ్రీః- మునిబాలకులారా! మీగానమాధుర్యమును, వచశ్శుద్ధియు, నిర్దుష్టస్వరమును, లయయు నీసభ సంతసాంబునిధిఁ దేల్చినవి. బాలురు మీ రలసియుందురు. నేఁటికిఁ జాలింపుఁడు. రేపకడఁ దిరిగి గాన మొనర్ప రండు. భరతలక్ష్మణులారా! ఈబాలురకుఁ బదునెనిమిదివేల పసిఁడినాణెముల నొసంగి, వారి కామితములఁ దీర్చి పంపుఁడు.

భ,లః- మహాప్రసాదము. (నిష్క్రమించి బంగారునాణెములతోఁ బ్రవేశించి)

భః- మునిబాలకులారా! మహాప్రభునాజ్ఞానుసార మీధనరాశి స్వీకరింపుఁడు.

లక్ష్మః- మీ కింకేమేని గామితమున్నఁ దెలుపుఁడు.

కుః- తమ్ముఁడా! నిత్యసంతుష్టుల మగుమనకుఁ గామితములేవిగలవు. ఆశపోతు బ్రాహ్మణబాలురమని యీబంగారు నివ్వఁదెచ్చినారు.

ఉ. కానల నాకలంబులను ఖాదనము న్బొనరించి దైవత
ధ్యాన మొనర్చువారలకుఁ దస్కరబాధల కాలవాలమై
మానులు లోష్టభంగిఁ గనుమాడల నీయఁగవచ్చినార లీ
దాన మిదేల మాకు? ప్రమదం బిదునే యిది తాపసాళికిన్!

లవః- అన్నా! నేఁ గనుఁగొనెద. భూవరులారా!

క. సురుచికరములౌ మూలము
లరుదౌ మధుజలము లాని హర్షించుతపో

నిరతుల కివి యేటికిఁ బా
తరలిడనా ? ఏల నీయందలఁచితి రిటులన్.

శ్రీ:- మునిబాలకులారా ! అవ్యక్తమధురములగు మీవాక్కుల నమృతముఁ జిప్పిలఁజేసి మా కాప్యాయనంబుఁగూర్చితిరి. మీర లెవరి శిష్యులు ? ఈకావ్యము రచించిన దెవరు ?

కు:- మహారాజా ! మేము వాల్మీకిశిష్యులము.

లవ:- ఆమహామహులే దీనిని రచించిరి.

శ్రీ:- కుఱ్ఱలారా ! దీనిని నాకు సాంతముగా ననుదినము వినిపింపుఁడు.

కు:- ప్రభువుల యాజ్ఞానుసారమే.

లవ:- నేఁటికిఁ బోయివత్తుము.

శ్రీ:- సరియే. అట్లే కానిండు. (కుశలవులు నిష్క్రమింతురు)

ప:- అన్నా ! వీరలు జటావల్కలములఁ దీసివైచిన మూర్తముల జానకీదేవిని శ్రీరామచంద్రప్రభువును బోలుటలేదా ?

వి:- తమ్ముఁడా ! నాకుఁ దోఁచినది నీకునుఁ దోఁచెనా నాయనా ! లక్ష్మణప్రభునిఁ గనుఁగొందము. (లక్ష్మణునిదిక్కై) లక్ష్మణ ప్రభూ ! ఇటు రండు.

ల:- (సమీపించి) భూసురవర్యా ! ఏమివిశేషము ?

వి:- సౌమిత్రీ ! ఈబాలురముఖవర్చస్సుల గమనించితిరా ?

ల:- భూసురవర్యా ! నాసందియమే మీకును బొడమినదా ? నిజము గనే

గీ. రూపములఁ జూడ మామాతరూప మొప్ప
వాగ్గభీరతఁ గాంచఁగా వనధిజేత
యైనయగ్రజునచ్చులటంచుఁ దోఁచు
నృపసుతులఁ బోలుదురు వీ ర్మ్రుఖేందుకళల.

నేఁ గనుఁగొనెద. మీ రెల్ల రేగుఁడు.

వి, ప:- చిత్తము. (విష్ణుశర్మపద్మనాభశర్మలు, శ్రీరామలక్ష్మణులు, తక్కినెల్లరును నిష్క్రమింతురు)

ల:- (స్వగతము) ఈసంగతి నగ్రజునితోఁ బ్రస్తావించెదఁగాక. (శ్రీరాముని దరిసి) అగ్రజా! ఈబాలకు లెవరైయుందురు? మీకేమని యాలోచన వొడమెనా?

శ్రీ:- అనుజా!

గీ. ఆకృతిని గన మైథిలి యన్నిపట్ల
ఠీవి, గాంభీర్యవృత్తి నటించుపట్ల
రాఘవు లనియె నాయంతరాత్మ పలుకు
తేల్చు మిదమిత్థమని దీని ధీసమేత!

ల:- అగ్రజా! లోకంబున మనుష్యునిఁబోలు మనుష్యు లుండవచ్చును గాని యిందఱయంతరాత్మ లొక్కయాశమునే స్థిరీకరించుచుండ నందుఁ దప్పు పొరయదు. నేను నిండుచూలాలగు మాజననిని వాల్మీకాశ్రమప్రాంతమున వీడివచ్చితిని. అప్పటి కిప్పటి కెన్నిసంవత్సరము లైనవో యీ కుమారులుఁగూడ నంతేవయస్సుగలవారుగాఁ దోఁచుచున్నారు. పైపెచ్చు వాల్మీకిశిష్యులమని చెప్పిరి కదా? రూపమున ముమ్మూర్తముల మాజననిఁ బోలియున్నారు. దుందుభిస్వనమునను, రాజలక్షణముల దేవరనోట నూడిపడిన ట్లున్నారు కావున నీకుమారుల జానకీజనని వాల్మీకాశ్రమమునఁ గనిన వారల నాఋషీశ్వరుఁ డింతవారలఁ జేసెనని తోఁచుచున్నది. వారికి వార్తాహరునిఁ బంపిన సర్వముఁ దెల్లముకాఁగలదని నా తలంపు.

శ్రీ:- సౌమిత్రీ! నీయోజన యెంతయు యుక్తియుక్తముగను సమంజసముగ నున్నది. ఆవాల్మీకి వీరు నాపుత్రులనియే చెప్పెడిచో సీత సాధ్వియని శపథముఁజేయునేమో. కనుఁగొనిరమ్మని వార్తాహరునిఁ బుత్తెంచుము.

ల:- మహాప్రసాదము. (నిష్క్రమించి ప్రవేశించి) వాల్మీకిమహర్షి పొంతపర్ణశాలలోనే కలఁడు. వార్తాహరునిఁ బుత్తెంచి వచ్చితిని. వాఁడు వాయువేగమనోవేగంబులఁ బోయినాఁడు. ఇప్పుడే యేదో వార్తఁ దేఁగలఁడు.

శ్రీ:- లక్ష్మణా! కానిమ్ము. కూరుచుండుము. (స్వగతము) వాల్మీకి యేమి ప్రత్యేచునో యని మనము చాలఁ దహతహపడుచున్నది.

చ. బుడుతలు నాకుపుత్త్రులని భూమిజ సాధ్వియటంచు సత్యమం
చుడుగక మౌని చెప్పఁ దల నూఁపక కాదనియెట్టులందుఁ? నా
నుడులవిధంబున జ్ఞన జను ల్నను మెత్తురె? వచ్చినట్టివా
డుడుగునె దానిమించినమఱొండునిదర్శన ముండకున్నచోఁ?

ఎచ్చటి కేగినను నాకుఁజిక్కులే యొనగూడుచున్నవి. ముందు నూయి, వెనుక గోయి యనునట్లున్నది.

గీ. తపసి తనమాట విననిచోఁ గుపితుఁడగునో?
వల్లె యనినచోఁ బోవదు వాదు జగతి
ఎవరి మెప్పింతు విడుతు నిం దెవరి నకట!
లోకమన భిన్నరుచి యెట్టులో కడంగ?

రఘువంశకళంకమా! వాల్మీకి వాక్యమునకు లొంగి నిన్ను పేక్షింతునని నామనఃఫలకమునుండి జార నుంకించుచున్నావు. ఓకళంకభుజంగమా! కాళ్ళు లేకున్నను మెల్లగ నామనోదృక్పథమునుండి మఱుఁగున కేగఁ దెగింపకుము. హుంకారమాత్రజగత్సంక్షోభకారకావక్రపరాక్రముఁ డగునీ రామాహితుండీకుని మోసలనా నీచెలగాటములు! నిలువుము. నిలువుము. అడుగు దాటకుము. రామా! పరమశాంతమూర్తి వగునీ కీ కోపము తగునా? ఎవరో జను లాడినపలుకుల విని ప్రాచేతసునే ధిక్కరింతువా? అట్లనకుము. ఇది ధిక్కారము కాదు. వారికిఁ బ్రస్తుతాంశమంతయు నివేదించి లోకమున కాదర్శకప్రాయుఁడు కావలసినచోఁ డట్టిసమయమున నెట్లు ప్రవర్తింపననువగునో దేవరయే యాలోచించి సెలవిండని ప్రార్థనాపూర్వకముగాఁ బ్రార్థించిన సర్వజ్ఞు లగువారు కాదనరు. ఇదియే త్రోవ; మఱియొకటి లేనేలేదు.

ల:- ఏమి యాగుట్టుపడెక్కలచప్పుడు? ఓహో! వార్తాహరుఁడు వచ్చినట్లున్నాఁడు. (కొంచెము ముందునకు సాగును, వార్తాహరుఁడు ప్రవేశించును)

వా:- జయము జయము మహారాజుగారికి.

శ్రీ:- (ఆతురముతో) వార్తాహరా! వాల్మీకిమహర్షి వర్యుఁడు కౌను పించెనా? ఏమిచెప్పెను?

వా:- మహాప్రభూ! అవధారు. నేను వారియొద్దకుఁ బోవునప్పటికి వారు సాయాహ్నికములఁ దీర్చుకొని యొకదర్భాసనమునఁ గూరుచుండియుండిరి. నేను వారికి నమస్కరించి లక్ష్మణప్రభువుగారు నాముఖమునఁ బంపినవార్తను దెలిపితిని. వారు యోజించి యాబాలకు లిరువురు జానకీపుత్రులే యనియు జనకజ పరమసాధ్వి యనుట నిస్సంశయమనియుఁ బ్రభునాజ్ఞ యగునేని దాను కుశలవ, జానకీయుక్తముగా వచ్చి ప్రభువులసందియముఁ దీర్చెద ననియుఁ దమ కెఱింగింపుమనిరి.

ల:- అగ్రజా! ఏమియును లేదు. ఆవలఁ దెలిపెదను. (వార్తావహుని దిక్కు) వార్తావహా! ఎల్లి సూర్యోదయమున జానకి తనపాతివ్రత్యమునుగుఱించి శపథముఁ జేయనున్నది గనుక సందియము గల నాగరజానపదులనేల యెల్లర నశ్వమేధవాటికకడకు వచ్చి యాదృశ్యమును గన్నులారఁజూచి సందియమువాపుకొనవచ్చునని చాటించి మహర్షియొద్దకుఁ బోయి రేపు జానకీకుశలవసహితముగ దర్శనమియ్యవలసినదని మనవిచేసి పొమ్ము.

వా:- మహాప్రసాదము. ప్రభునాజ్ఞ శిరమునఁ దాల్చితి. సెలవు.

శ్రీ:- సరియే. పోయిరమ్ము. (వార్తాహరుఁడు నిష్క్రమించును) లక్ష్మణా! మనమున నేమో చేయిఁబెట్టి కలఁచిన ట్లున్నది. ఎన్నఁడునులేని తహతహ వొడముచున్నది. కారణమేమి చెపుమా! లక్ష్మణా! చాలప్రొద్దుకూడఁ బోయిన ట్లున్నది. కొంచెము విశ్రమించుదము.

ల:- అగ్రజా! ఆలాగే కానిండు. నాకు నిద్దురవచ్చుట లేదు. మరల వత్తును. తాము విశ్రమింపుఁడు.

శ్రీ:- (ఆసనమునఁ గొంచె మొరిగి) అబ్బా! అదియేమోకాని నిద్దుర పట్టుటలేదు.

# చతుర్థాంకము

మ. అదిగో రెండవజాముకుక్కుటము నాయ ల్లింతయున్ దండడి
న్నిదురన్గున్కక కూయఁగాఁదొడఁగె,నిర్నిద్ర న్వియోగాగ్ని బె
ట్టిదమై తోఁచినకామినీహృదయవాటి న్రాజు వీక్షింపఁగాఁ
బథమున్జూపెడి రిక్కలెంకలు నభోభాగంబున న్వెల్గుచున్.

క. రేపకడఁగాంతు రఘుకుల
దీపకులను జానకీతృతీయుల మునిపె
న్నాఁపున వెలిఁగెడిపుత్రులఁ
దాపమువాయంగ నతిముదం బుదయింపన్.

అదిగో లక్ష్మణుఁడుకూడ వచ్చుచున్నాఁడు. ఆలోచనానిమగ్నులకు బధిరత్వముకూడఁ బ్రాపించుఁగాఁబోలు. కూసినది మూఁడవజాముకోడి కాఁబోలు. మూఁడవజాముకూడ మీఱినదా యేమి ? ఇంకను సందియమేల ?

ఉ. నావచనం బలక్ష్యము నొనర్తువె ? యిట్టిదె నీదుభక్తి ? య
న్నావనుఁ డైనమానివరుపావకలోచనవిస్ఫులింగశో
భావహనంబురీతిఁ గనుపట్టెడిఁ బ్రాగ్దిశ సాంధ్యరాగ, మిం
కీవిధి యేల ? క్రుంకులిడ నేగెద గోమతి సంధ్యవార్వఁగన్.

లః- (ప్రవేశించి)

గీ. వందిమాగధజనములు మందమతులు
నిదురమబ్బున నున్నట్టి నృపతివరుని
బెద్దపెట్టున నఱచి లేపెదరని కవి
తతులు భయభక్తి మృదులగీతముల లేపు.

అగ్రజుఁడు మేలుకొనియే యున్నట్లున్నది. మహాప్రభువులకు సేవకుఁడు లక్ష్మణుఁడు నమస్కరించుచున్నాఁడు. (నమస్కరించును)

శ్రీ:- దీర్ఘాయుష్మాన్ భవ. తమ్ముఁడా ! పక్షిరుతమును బహురమ్యముగ వర్ణించితివి. ఆకవుల మఱపింపనెంచినట్లు నన్నును మఱపింపనెంచి నిదురించుచుంటిననియా నిశ్శబ్దముగ వచ్చితివి. నిదురించువారలకు సుప్రభాతములు కార్యకారులుకాని నిర్నిద్రులకెట్లగును?

లః- అగ్రజా ! అయిన మీరు నిదురించనే లేదా యేమి ?

శ్రీః- నాయనా ! లేదు. (సుగ్రీవవిభీషణులు ప్రవేశింతురు)

సు,విః- శ్రీరామచంద్రమహారాజ్ కి జై. సేవకులు నమస్కరించు చున్నారు. (నమస్కరించి ఘటితాంజలులై నిలుచుందురు)

సుః- మహాప్రభూ ! సముద్రారావగుణ మగు నాకల్లోలము వింటిరా? నాగరజానపదులు గుంపులుగుంపులుగ వచ్చుచున్నారలు.

శ్రీః- కపిప్రభూ ! రాక్షసరాజా! మీరిచ్చటనే యుండి వచ్చువారల సరిగా యోగ్యతానుసార ముపవిష్టులంజేయుచుండుఁడు. మే మిదే కాల్యంబులఁ దీర్చివచ్చెదము.

సు,విః- చిత్తము. (శ్రీరామలక్ష్మణులు నిష్క్రమింతురు)

సుః- విభీషణా ! ఏల యిల్లెడమక న్నదరుచున్నది ?

విః- సుగ్రీవా ! ఏల నాయెడమబాహువు వదరుచున్నది ? ఈనాఁడేమి కానున్నదో కాని యమంగళమే స్ఫురించుచున్నది.

సుః- విభీషణా ! విధి తలుచుకొనివచ్చినఁ బాద లడ్డమా ? శుభాశుభము లన్నియు శ్రీరామార్పణమొనర్చి సాక్షీభూతులమై చూచుచుందము.

విః- లేక చేసెడి దేమున్నది ? ఏమియును లేదు. ' అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ ;

సుః- అరుగో మహాప్రభువు లిరువురు వచ్చుచున్నారు

ఉ. వంశజుఁడైనరామనరపాలుని నిశ్చలమాధృతి నగర్ణ
బ్రాంశుకరంబుల జ్జలదపంక్తులఁ దోలుచు వచ్చుభానుఁడు
నస్సంశయమేఘపంక్తి నిజజాయ యొనర్చుప్రతిజ్ఞపెంపున
న్భ్రంశ మొనర్ప నెంచునరపాలశిఖామణి రామునిన్బలెన్.

విః- ఏమిదృశ్య మేమిదృశ్యము ! ఈవైపునుండి శ్రీరామలక్ష్మణ ప్రభువులు నావంకనుండి వాల్మీకి జానకీ, కుశ, లవ సమేతముగ వచ్చుచున్నారు. మాచిన్నప్రభువులఁ గవుంగిలించుకొన నామన ముఉవ్విళ్లూరుచున్నది. కానిమ్ము.

(హనుమంతుఁడు పరమానందముతోఁ బ్రవేశించి)

హ:- ఉత్సా. అవనిజాహృదుత్పలామృతాంశ ! క్షత్రిమండనా !
సవనదీక్షితా ! సుపూజ్య ! సజ్జనానురంజకా !
ప్రవిమలాచ్ఛకీర్తిచంద్రరాజితప్రపంచ ! యో
రవికులాబ్ధిచంద్ర ! రామ ! రామ ! రాజవాసవా !

(శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్న లొకవైపునుండియు, వాల్మీకి, జానకి, కుశ, లవు లొకప్రక్కనుండియుఁ బ్రవేశింతురు. మఱియొకవంకనుండి బ్రహ్మ వచ్చును.)

శ్రీ,ల,భ,శ,సు, వి,హ,జా,కు,ల } సురజ్యేష్ఠునకు మునివృషభులకు నమస్కరించుచున్నారము. (నమస్కరింతురు)

బ్ర:- దీర్ఘాయుష్మంతో భవత. దీర్ఘాయుష్మంతో భవత. సత్కీర్తిరస్తు

వా:- శ్రీరామచంద్రా ! మీ వేడుకోలున వచ్చినారము.

శ్రీ:- తాపసచంద్రా ! పరమసంతోషము. పతివ్రతాతిలకమైనను భూమిజ నడువడి లోకసంశయాస్పదమై రవివంశకళంకాయమానమైనదిగావున జననిందాభీరు వగునృపాలమాతృఁడిప్పట్టున నే మొనర్పవలయునో సర్వజ్ఞులరు సమయజ్ఞుల రగుతామే బోధింప సమర్థులు.

వా:- వత్సా ! రామచంద్రా ! జానకీపాతివ్రత్యముంగూర్చి జనసమూహము నెదుట నేను శపథముఁజేసినఁ జాలునేమో యోజింపుము.

శ్రీ:- ఋషివర్యా ! తాము శపథముఁజేయుటకు నాకు సంశయ ముండినఁగదా ? ఈనాపరీక్ష లోకజనసంతృప్తికేకాని వేఱుకాదుకదా ? తమయాలోచనానుసారముగఁ దామే శపథ మొనరించిన

ఉ. ఛిన్నతఁజెందినట్టికవఁ జేర్చుతలంపునఁ బుట్టపుట్టు వీ
తెన్నున బాసఁజేసెను, బతివ్రతయానెడ జంకనేల యా
యన్నులమిన్న సీత ? జను లాడుట నప్పుడు వీడె రాముఁ; డిం
కెన్నిదినంబు లుండు? నని యేవపుఁజూడ్కులఁ జూడరే ప్రజల్ ?

కావున నన్మహర్ష్యభిలాషులగుట మనవిఁజేయుచున్నాఁడను. జానకీశపథముననే జననింద తీఱుఁగాని మఱియొండుపథంబు లేదు. నాయవినయమునకు క్షమింపవేఁడుచున్నాఁడ.

వా:- శ్రీరామా! బుద్ధిః కర్మానుసారిణీ. నే నేమిచేయఁగల? (జానకిదిక్కై) పరమపూతా! జానకీ! నీపవిత్రత నెఱిఁగినవాఁడ నగుటచే నీవిషయమై నాశక్తివంచనలేక శ్రీరామచంద్రునకుఁ జెప్పిచూచితిని. ఆయన నీలోకనిందేంధనము నీశపథాగ్నిచేతనే భస్మీభూతము కావలయునని కోరుచున్నాఁడు.

జా:- (కన్నీటితో నధోముఖియై కాలిబొటనవ్రేలు నేల వ్రాయుచు) మునివర్యా! నే నిప్పటికే యట్లొనర్పఁ బరమసంసిద్ధను. పైపెచ్చు భర్త్రాజ్ఞకూడ నైనది. భర్త్రాజ్ఞ నిర్వర్తించుటయేకదా పతివ్రతకుఁ బ్రథమధర్మము? సందియమేల? అట్లే యొనర్చెద.

శ్రీ:- జానకీ! పరమసంతోషము. ఆరీతినే యొనర్తువుగాక.

జా:- (శ్రీరామునకుఁ గృతాంజలియై మున్మాటు ప్రదక్షిణ మొనర్చి)

క. నిరతము విభునామంబును
స్మరియించెద నేని మానసంబున, వాణిన్,
గరణమున, నిట్టిదీనకు
ధరణీ! నినుఁ జేర నాకు దారి నొసఁగుమీ.

క. మానసమున నేన్ రాముని
బోనాడి తదన్యుఁ డైనపూరుషు నొరునిన్
ధ్యానింపనిశీలవతిన
యేని ధరణీ! చనంగ నీయవె త్రోవన్.

క. అనవరతపతివ్రతనని
మనమునఁ దలతేని నీకుమారిని నీలోఁ
గొని కష్టముల న్బాపఁగ
జననీ! ధరణీ! చనంగ జాడ నొసఁగుమీ.

(తెరలో సంకులమై తెర లేచును)

(భూదేవి నలువురునాగులు వహించిన సింహాసనముపై నాసీనయై ప్రవేశించి జానకిని దరిసి కవుంగిలించుకొని మూర్ధమాఘ్రాణించి) తల్లీ! ఏవేళ భూమి నవతరించితివో కాని లోకమునఁగల కష్టము లన్నియు నిన్నే వలచినవి. పరమశాంతవు. తాల్మిని నన్ను మించితివి. సంశయాస్పద మైన యీలోకంబునఁ బరమ పతివ్రత వగునట్టినీ కుండఁ దావు లేదు, రమ్ము. (తీసికొనిచని సింహాసనాసీన యగును.

(తెరలోఁ దిరిగి కోలాహలమగును. తెర వ్రాలును)

కు,ల:- (జానకి పోయినజాడనే చూచుచుఁ గన్నీరు నించుదురు)

భ,ల:- ఆహా! ఏమి యీపుష్పవృష్టి! ఈవియద్గంగాశీకరములసోన! ఆహాహా! తల్లీ! నీ వికఁ మాకుఁ గాన్పింపవా? రఘువంశస్థితి యెట్లు మాఱినది! (మూర్ఛిల్లుదురు)

వి:- హా! తల్లీ! (మూర్ఛిల్లును)

సు:- అయ్యో! అయ్యో! (మూర్ఛిల్లును)

హ:- (కన్నీరు నించుచు) జానకీమాతా! నీదర్శనము మా కిఁక నలభ్యమా! హా! హా!

శ్రీ:- (దండకాష్ఠమును జేఁబూని విషణ్ణుఁడై) అక్కటా! జననిందాభీరువునై నాయొనర్చిన యీకార్య మీవిధముగాఁ బరిణమించినదా? లోకుల నందఱను మెప్పింపవలయునని ప్రయత్నించువా రెవ్వరిని మెప్పింపలేక తుదకుఁ గష్టనష్టముల పాలగుదురని చెప్పుట కన్నిటికి సాదర్శ ప్రాయుఁడనైననేను దీనికిఁగూడఁ గావలసి వచ్చినది. గడచినదానికి వగచిన నేమికలదు? (కుశలవుల దగ్గరకుఁ దీసికొని) చిన్నితండ్రులారా! రఘువంశకళంకముఁబాప నేఁజేసిన దానిఫలితము మీరలు తల్లిలేనివా రగుటయు, నే నపత్నీకత వియోగ మనుభవింపవలసినవాఁడ నగుటయే. పితృవాక్యపాలనమున శ్రీరామునికిఁదగినసుతు లనిపించుకొన నయోధ్యకు రండు.

కు, ల:- జనకునాజ్ఞ శిరసావహించుచున్నారము.

శ్రీ:- చిన్నితండ్రులారా! పరమానందము. (కవుంగిలించుకొని మూర్ధ మాఘ్రాణించి) ఇట్టితతి మాజానకి లేకుండ నెడబాపినది కదా యాభూదేవి! (కోపియై) ఒకక్రియకుఁ బ్రతిక్రియ యోజింపవలయునేకాని తల వ్రేలవైచికొని యొంగియుండిన నేమి లాభము! (ధరణి నుద్దేశించి) ఓభూదేవీ! భూమిజకు మాతవగుట నాకుఁ బూజ్యురాల వగుట నత్తగారవు. భూమిజావియోగదందహ్యమానమానసుండ నగునాప్రార్థన నంగీకరించి నాకు భూమిజను దిరిగి నొసంగుము. లేదా నీలోనికి నన్నుఁగూడఁ గొంపోయి భూమిజకడఁ జేర్పుము. లేకుండిన

ఆ. కదల నున్న నీదుగర్భస్థ యైనట్టి
భూమిజాత జనకభూవరుండు
తెచ్చినట్లు నాదుతీవ్రబాణంబున
వనధి ముంచి సీత వడయువాఁడ.

గీ. సురలఁ జెఱగొన్న రాక్షసేశ్వరుని, శౌర్య
ధనుని, రావణుఁ గూల్చి, తద్భవననిహిత
నిముసమున సీతఁ దెచ్చితి; నిన్నుఁబోలు
సుదతికడ నున్నదానిఁ దెచ్చుటయు లెక్క!

అశ్వమేధమయినదికదా. ఆపసి కిప్పుడే కడంగెదను.

బ్ర:- శ్రీరామచంద్రా! సర్వజ్ఞుఁడవు. శాంతస్వరూపుఁడవు. విష్ణ్వంశ సంభూతుండ వగునీ కీకోపము తగునా? కాలధర్మము ననుసరింప మిమ్ము స్మరింపఁజేయ నే నెంతవాఁడను? శాంతించి యీకుశ లవులవలన రామాయణకథ విని యుత్తరకాండ మేకతంబున విని యయోధ్యఁ జేరుము.

శ్రీ:- (శాంతించి) విధాతా! అగును. కాలధర్మమును, గర్మఫలమును రెండు సమానముగ నవిలంఘనీయములే.

చ. అనలుని సర్వభక్షకునియట్లుగ నిర్జరసంఘహవ్యవా
హనుగతిఁ, జంద్రు రోగిగను, నంబుధుల న్నిరతంబు ఘోషిల
న్బొనరిచి,త్ర్యక్షు భిక్షునిగను, న్నను సారెను ద్రిప్ప,రామచం
ద్రుని సతి, బాయఁజేయునవిధూతవిధి న్దరియింప శక్యమే ?

ఇదియు నొకందుకు మంచిదే యైనది. అన్నివిషయముల
యం దాదర్శకప్రాయ మైనరామచరిత్రమున నీషణత్రయములోఁ
బ్రప్రథమ మైనదారేషణము వదలి యేకపత్నీవ్రతమునుగూడ లో
కంబునకుఁ జూపఁ బథముఁ గల్పించితివి. నీకుఁ గృతజ్ఞుఁడ. సుర
జ్యేష్ఠుశాసనము శిరసావహించుచున్నాఁడ. పోయివచ్చెద.

బ్ర:- తథాస్తు.

(తెర వ్రాలును)



# శ్రీ రామ ప్రస్థానము



## పంచమాంకము

శ్రీరామాలోచనాభవనము.

[శ్రీరాముఁ డుచితాసనమునను లక్ష్మణుఁడు ప్రక్కయాసనమునఁ గూరుచుండియుందురు]

శ్రీ:- తమ్ముఁడా! జానకీవియోగము సంభవించి పదివేలవర్షములు కడచినవికదా? ఎన్నినా ళ్ళీయయోధ్య నిఁకనుండుట? మన భరతుఁడు గంధర్వుల జయించి తనపుత్రు లగుతక్షపుష్కలులను దక్షశిలయందును, పుష్కలావతీపురంబునను బట్టభద్రుల నొనర్చెనని విని సంతసించితిని. నిన్ననిన్ననే గారుపథ, చంద్రకాంతంబులకు నీసుతుల నంగదచంద్రకేతులను బ్రభువుల నొనర్చితిమి కదా? చేతి కెక్కివచ్చినబిడ్డలకు భూభారముఁ గొంతకొంత యప్పగించుటచే మనకుఁ దేలికయగుచున్నదికదా?

ల:- అగ్రజా! ఇది లోకసహజమేకదా!

శ్రీ:- నాయనా! అగును.

ల:- (వినుట నటించి) అగ్రజా! హజారంబున నేవియో గంభీరభాషణంబులు వినవచ్చుచున్నవి. మునివాక్యంబులుగా నున్నవి. ఎదురేగి పిలుచుకొనివత్తునా?

శ్రీ:- అనుజా! అవశ్య మట్లే చేయుము.

ల:- (ముందునకు పోగును; ముని ప్రవేశించును.)

ము:- (స్వగతము) అదుగో శ్రీరామచంద్రమూర్తి సౌమిత్రిద్వితీయుఁడై యాలోచనాభవనమున నున్నాఁడు. డాసెద. (ముందునకు నడచును)

ల:- ఋషీశ్వరా! అభివాదనములు. ఇటు.ఇటు. (త్రోవఁ జూపును)

శ్రీ:- (ఆసనమునుండి లేచి) మునీంద్రుల కైక్ష్వాకుఁడు శ్రీరాముఁడనుజసహితముగ నభివాదనముఁ జేయుచున్నాఁడు.

ము:- ధర్మవృత్తి రస్తు.

శ్రీ:- తాపసివర్యా! ఈయాసనంబు నలంకరింపుఁడు. (ముని యాసీనుఁ డగును)

ము:- శ్రీరామచంద్రా! కుశలమే. నీతో నొకవిషయ మేకతమ సంభాషింపవలతు. ఆసంభాషణ విన్నవాఁడును, మనము సంభాషించుతఱి వచ్చినవాఁడును వధ్యుఁడగునట్లు శాసించి యేకాంతముఁ గూర్చిన సంభాషింపనెంతును.

శ్రీ:- లక్ష్మణా! వింటివికదా మునివరునాజ్ఞ? అతిజాగరూకతతో మెలఁగవలసినపట్టున సామాన్యదాసుల హాజారంబున నుంచుట ప్రమాదకరముకదా?

ల:- అగ్రజా! మీయింగిత మెఱింగితిని. (కడు సంతసంబున) ఈ దాసుఁ డున్నాఁడుకదా?మీకేల? పరమధన్యుఁడ. పరమధన్యుఁడ. పరమధన్యుఁడ.

గీ. సేవకుల వేనవేల వచింప నేల?
నీదుదాస్యంబు సురలె యనిశముఁగోర
సేవకాగ్రగణ్యునిగ నన్నేసినాఁడ
వింతకంటె నా కాకాంక్ష్య మేది కలదు?

శ్రీ:- అనుజా! సౌమిత్రీ! సర్వసమర్థుఁడవౌ నీవే దీని కెంతయుఁ దగినవాఁడవు. పోయి యటులే యొనర్పుము. జ్ఞప్తి బాగుగ నున్నదికదా?

క. భటు నవలఁ బంపి ద్వారని
కటమున నీ పృంఁడు మెవరుకానియు రారా

దిటకొను, మముఁ గనఁగూడదు
పటుబల ! మీతాడియవజ్ఞఁ బరిమార్పింతుర్.

లః- చిత్తము. అవహితుఁడ. సెలవు. (లక్ష్మణుఁడు నిష్క్రమించి ద్వారమున నుండును)

శ్రీ:- మునీంద్రా ! ఇఁక మీవృత్తాంత మెఱింగింపుఁడు.

ముః- మహాత్మా ! చిత్తము. నేను జతురాననునిచేఁ బంపఁబడిన కాలుఁడను. ఆవిధాత తమకు మనవిఁ జేయుమనినటులఁ జెప్పువాఁడను. "నేను మీపుత్త్రుఁడను. తొల్లి క్షీరసాగరశాయివై యున్నతఱిఁ దమనాభినుండి వెలువడిన కనకపద్మంబున నేఁ బుట్ట నాకు సృష్ట్యధికార మొసంగితిరి చరాచర సృష్టిభారమునే తాల్పఁజాలనినాకు రక్షణభార మతిభారమని నే మనవిచేయ జగత్త్రాతవగునీవే దానిని వహించితివి. ఆదితేయుఁడవై సురలఁ దోడునీడవై ప్రోచితివి. జగద్భయంకరుఁ డగురావణునిఁ బరిమార్ప దాశరథివై భువిపైఁ బదునొకండువేలవత్సరంబు లవతారంబుఁదాల్ప సంకల్పించితివి. ఆమితి డాసెను. మీస్వస్థానముఁ జేరసమయమని విన్నవింపు"మనెను.

శ్రీ:- (నవ్వుచు) కాలా ! అగును. నాకును జ్ఞప్తియున్నది.

ఉ. అన్నియుఁ దీఱె నాపను లిఁకచ్చటికే చనుదేర నెంచితిన్.
నన్నిరతంబు మానసమున న్దలపోసెడినిర్జరావళిన్
మన్ననసేయుకంటె నిట నా కధికం బెదియేనిఁ గల్గునే ?
మన్నియమంబు నంతె చనుమాయనుమానముమానియంతకా!

లః- (విసుఁగు నటించుచు) అగ్రజా ! ఈముక్కోపి యగుదూర్వాసునివంశవిధ్వంసశాపములకై వెఱచి సమయముఁ దప్పి రాక తప్పినదికాదు.

చ. 'సమయముకాదుకాదిపుడుసంయమిశేఖర!యొక్కమూర్తముం
డుమ'యని వేఁడునన్గని; కడుంగడురోసముఁగ్రుక్కకన్నులన్
మిడుగురు లుర్ల, వంశ మిలమీఁదఁ జెడన్శపియింతునంచు, దుం
దుడుకున నత్రిపుత్త్రుఁడిటఁ ద్రొందరఁజెం దెడిమిమ్ముఁజూడఁగన్

శ్రీ:- (విషణ్ణవదనుఁడై తల పంకించి) సౌమిత్రీ! రానిమ్ము.

ల:- చిత్తము. (నిష్క్రమించును)

శ్రీ:- అంతకా! సరియే యింక నీ వరుగుము.

ము:- చిత్తము. మహాప్రసాదము. (నిష్క్రమించును. లక్ష్మణదూర్వాసులు ప్రవేశింతురు.)

ల:- మునీంద్రా! ఇటు. ఇటు. (త్రోవఁజూపును)

శ్రీ:- దూర్వాసమునీంద్రులకు రాఘవుఁడు శ్రీరాముఁడు మ్రొక్కుచున్నాఁడు.

దూ:- ధర్మపథబుద్ధి రస్తు.

శ్రీ:- మునివరేణ్యా! తమయాగమనకారణం బెఱింగించి నన్ను ధన్యునిఁ జేయుఁడు.

దూ:- శ్రీరామచంద్రా!

గీ. వేయువత్సరములు తపోవృత్తిఁ గడపి
యతిక్షుధాబాధితుఁడనైతి ననఘచరిత!
యంగదను దీర్చుకొనియేగ నరుగుదెంచి
నాఁడఁ దనుపవే నను రఘునాథ! నేఁడు.

శ్రీ:- లక్ష్మణా! ఇయ్యనఘుని నిష్టమృష్టాన్నసంతుష్టు నొనర్చి పంపి రమ్ము.

ల:- చిత్తము. మహాప్రసాదము.

శ్రీ:- మునివర్యా! లక్ష్మణునివెంట నేగుఁడు.

ల:- మునివర్యా! రండు.

దూ:- రామచంద్రా! పోయి వత్తు.

శ్రీ:- (నమస్కరించి) చిత్తము. (దూర్వాసలక్ష్మణులు నిష్క్రమింతురు) ఎవరురా యక్కడ? (సేవకుఁడు ప్రవేశించును)

సే:- (నమస్కరించి) జయము జయము మహారాజులకు. ఏమి సెలవు?

శ్రీ:- గురువులవారిని దక్షణము పిలుచుకొని రమ్ము.

సీ:- చిత్తము. మహాప్రసాదము. (నిష్క్రమించును)

శ్రీ:- అకటా! లక్ష్మణా! పిట్టపిడుగువలె సమయమున కీదూర్వాసుఁ డెక్కడనుండి దాపరించె? కట్టా! దుర్విధీ!

ఉ. ఇంటను గల్గుభార్య విడ నించుకయున్ వెనుకాడకుండ, నా
వెంటఁ జతుర్దశాబ్దములు వెన్వెనుక న్జరియించి, యాజిలోఁ
గంటకులైనరాక్షసులఁ గాలునిపోలికిఁ బంప సాయమై,
కంటికి ఱెప్పవోలె ననుఁగాచినలక్ష్మణునా వధించుటల్ ?

కటకటా ! ఈశ్రీరామున కెంతటినిశితపరీక్ష ! అర్ధాంగి యగునాలి నావిధిఁజేసె. వెన్నుఁదన్ని పుట్టినతమ్ము నీరీతిఁజేయ నుండె. ఇంక నేమేమి చేయవలసియున్నాఁడో ? శ్రీరామా ! ధైర్యము వహింపుము. అదృఢమై, మెత్తనిదై కళ్ళెముఁ ద్రెంచు కొనినయశ్వసమాన మగునీమనస్సునకు లొంగకుము. ఆత్మా ! నీస్వయంప్రభచే నీయజ్ఞానమాయాతిమిరాంతకమవు గమ్ము. 'తల్లి చెవులఁ ద్రెంచినవానికిఁ బినతల్లి చెవులు బీరపూలు కావట '

గీ. నిండుగర్భిణి భార్య వని న్విడువఁగఁ
బంపినట్టిరామునకు నీభ్రాంత యెంత ?
యెట్టిఖనిజంబుచే వీనియెద సృజింపఁ
బడియెనో లోహకారుఁ డాబ్రహ్మ యెఱుఁగు.

లః:- (ప్రవేశించి) అగ్రజా ! ఏమట్లు దీనాననులై యున్నారు ?

చ. మనమున మార్దవంబుఁదునుమ న్జలియించెదవేల నాపయిన్
గొనకుము జాలి సత్యమునకు న్వెసధైర్యముఁ జెప్పవేమి ? న
న్దునుమఁగ జంకె దేటికి ? జనుం డెదియైనఁ ద్యజించి సత్యము
న్గొనకొని కావఁగావలయుఁ గూళగఁ జూడరె సత్యహీనునిన్ ?

క. లెమ్ము, కరవాలమును జే
కొమ్మిదె వేచెడిసుమిత్రికొడు కనుసచ్ఛా
గమ్ము బలిఁబెట్టి ఋతయ
జ్ఞమ్మున వే వేల్ప, యశమున న్దేలంగన్.

శ్రీ:- ధర్మపక్షైకతత్పరా! లక్ష్మణా! ఆగుమాగుము. (పరికించి) అదుగో గురువులవారు వచ్చుచున్నారలు. ఎదురేగి కొనివచ్చెద. (లేచి ముందునకు నడువఁగా వశిష్ఠుఁడు ప్రవేశించును) గురువరేణ్యులకు శిష్యుఁడు రాఘవుఁడు శ్రీరాముఁడు నమస్కరించుచున్నాఁడు.

వ:- శ్రీరామచంద్రా! స్వాస్థ్య మస్తు.

శ్రీ:- (దుఃఖితుఁడై) గురూత్తమా! ఒకమునివరుఁడు. ... ...

వ:- శ్రీరామా! వలదు. వలదు. సర్వమును దివ్యదృష్టిఁ బరికించితిని. ఇది యింతకు నియమితము. అవిభాజ్యుఁ డగులక్ష్మణునిఁ బాయుట నిశ్చయమే. అది యింతకే నిర్దిష్టము.

శ్రీ:- గురువరా! సత్క్షత్రియుఁడు ప్రతిన రిత్తపుచ్చవచ్చునా?

(భరతుఁడు ప్రవేశించును)

భ:- గురువులకు నగ్రజునకు భరతుఁడు నమస్కరించుచున్నాఁడు.

వ, శ్రీ:- ధర్మకామాభివృద్ధి రస్తు.

వ:- శ్రీరామా! అట్లేల? జగత్సంక్షోభకారణ మగు నసత్యప్రలాపముకంటెను లక్ష్మణుని విడుచుటచే నిర్వర్తితప్రతిజ్ఞుఁడవు. కమ్మ.

శ్రీ:- గురువర్యునాజ్ఞ నౌదలఁ దాల్చుచున్నాఁడ. అనుజా! సౌమిత్రీ!

క. కడుఁగూర్చువాని విడుచుట
కడిఁదలఁదీయుటయె భ్రాతృవత్సల! ధర్మం
బుడుగుటకు జంకి నిన్నే
విడిచితి నయమార్గపరుని వీరవతంసున్.

ల:- (కన్నీరు నింపుచు) ధర్మప్రతిష్ఠాపనాచార్యా! మహాప్రభూ! ధర్మైకపథవర్తు లగుదేవర దాసుఁడు మీయాజ్ఞానుసారియై యయోధ్యవీథి చనుచున్నాఁడు.

గీ. త్వత్పదాంబుజచింతనఁ దవిలి యన్య
మొల్లకుందునాకును భవ ముండనేని

నామభాగ్యమై పావనుండ నాదుకొను-
వారము గృపఁ జేయవె ధర్మవత్సలాఖ్య !

రా. శరణం

శ్రీ:- స్వామిత్రీ ! అట్లే యగుఁగాక. (లక్ష్మణుఁడు తల వ్రేల్లవైచు కొని నిష్క్రమించును.)

దే:- (తెరప్రక్కన దేవేంద్రుఁడు ప్రవేశించి) నేను వీరలకెల్ల నిష్ప డదృశ్యుఁడనై శ్రీమల్లక్ష్మణమూర్తిని గొంపోవ వచ్చితిఁగదా. అదుగో యాతఁడిప్పుడే శ్రీరామచంద్రవిసర్జితుఁడై సరయూతటంబున వార్చి ప్రాణంబుల నియమించి యోగనిష్ఠాగరిష్ఠుం డగు తపోనిష్ఠునిచందంబునఁ గూరుచుండియున్నాఁ డిదియే మంచిసమయము. అదుగో సురలు మందారకుసుమంబులఁ గురియుచున్నారు. నే నాలసింపఁజనదు (నిష్క్రమించును)

శ్రీ:- గురువరా ! పరమభ్రాతృభక్తుం డగులక్ష్మణుఁడు పోవ నీరామున కీరాజ్యసుఖము లేల ? భరతా ! ఈరాజ్యమును నీవు స్వీకరించి పరిపాలింపుము.

భ:- మహాప్రభూ ! జనకునియాజ్ఞ యొకఁడుండఁబట్టి తా మడవి సంచరించుచుండినతఱిఁ గాయ మాయయోధ్యయందును నాత్మ తమపదసాన్నిధ్యంబున నుంచి పదునాల్గువత్సరములు పదునాల్గు మహాయుగములట్లు గడపితిఁగాని యిప్ప డట్టియాజ్ఞ యిడఁకుఁడు. కాళ్ళఁబసి మ్రొక్కెద. చతుర్దశభువనాధిపత్యమైనను దేవరపాద సేవాతుల్యముగఁ దలఁచువాఁడుకాఁ డీభరతుఁడు. నామనవిఁ జిత్తగించి కుశునకు దక్షిణకోసలము, లవున కుత్తరకోసలముఁ బట్టముఁగట్టి తమవెంట నన్నును శత్రుఘ్నుని మిము వెంబడింపఁ దదేకాగ్రచిత్తు లగుపౌరుల రా ననుజ్ఞయిండు.

శ్రీ:- అనుజా ! అటులే కానిమ్ము. శత్రుఘ్నుఁ దత్పుత్రులకుఁ బట్టముఁగట్టి రావలసినదనియు విభీషణసుగ్రీవుల నందఱిని సపరివారముగ రమ్మనియుఁ బుత్తెంచును.

భః- మహాప్రసాదము. (నిష్క్రమించి తిరిగి ప్రవేశించి) వాయువేగ మనోవేగంబులఁ బోవుదూతలఁ బంపి వచ్చితిని. వారెల్ల రిప్పుడే రాఁగలరు. ఇంతలోఁ దాము కుశలవులఁ బట్టాభిషిక్తులఁజేయుఁడు.

శ్రీః- గురువర్యా! ఏమియాజ్ఞ?

వః- అవశ్య మటులే కానగు.

శ్రీః- (కనుసన్నఁజేయ భరతుఁడు నిష్క్రమించి కిరీటచంద్రహాస హస్తుఁడై పట్టాభిషేకోచితాంబరములతోఁ గుశలవులఁ గొని వచ్చును.)

కు,లః- గురువర్యులకుఁ, బితృపాదులకుఁ, బితృవ్యులకు రాఘవులగు కుశలవులు నమస్కరించుచున్నారు.

వ,శ్రీ,భః- దీర్ఘాయుష్మంతౌ భవతం. (శ్రీరాముఁడు తనకిరీటచంద్ర హాసములను, భరతుఁడు తాఁదెచ్చినకిరీటచంద్రహాసములను వశి ష్ఠుని కందింతురు.)

శ్రీః- (కుశలవులను దగ్గఱకుఁ బిలిచి) పుత్రులారా! ఇటు రండు.

కు,లః- (దగ్గఱకు వత్తురు)

వః- (కిరీటములఁ గుశలవులకుఁ బెట్టి చంద్రహాసములఁ జేతుల నిచ్చును)

కు,లః- (వశిష్ఠశ్రీరామభరతులకు మ్రొక్కుదురు)

వః- శాశ్వతరాజ్యసుఖప్రాప్తి రస్తు. కుమారకంఠీరవులారా!

చ. సచివులమానసం బెఱిఁగి, సత్యపథం బెద నిల్పి, ధర్మప
దచలతఁబూని, పౌరుల నిజాత్మజులంచు గణించి, భూపతి
ప్రచయము భక్తియుక్తిని నిరంతరము న్భజియింప, శౌర్యధై
ర్యచణత, దేశికానుమతి రాజ్యరమ న్భరియింపుఁ డుండుఁడీ.

శ్రీః- గీ. వంశమూలపురుషుల రేవంకఁ జనిరో
వారియడుగుజాడలనె పోవలయుసుండి
వంశనిష్కళంకత్వము వఱలఁజేయఁ
బ్రాణములనైనఁ దృణములభంగిఁ గనుఁడు.

భ:- అగ్రజునవరస్వరూపులరును, ధర్మమూర్తు లనవొప్పు మీరలు నేఁగఁబవలసిన వన్నియుఁ బెద్దలవలన మున్నే వినియుంటిరి. అయి నను వినుఁడు.

గీ. ఎట్టికార్యంబుఁజేయుచో నేని బూని
దానఁ బొసఁగెడిచెట్టలఁ దలఁచి ముందు
పిదప లాభంబుల గణించి పెద్ద యేని
యగునో యటుచేయు టొప్పు ధరాధిపులకు.

కు:- పెద్దలవాక్యము లనుదినచింత్యములై కార్యరూపముల వహింపఁ గలవు. వందనసహస్రంబులు.

ల:- మీహితంబు లమృతప్రాయములై శ్రేయోభిలాషులకు సర్వార్థదంబులు. ఇట్టియమూల్యహితవాక్యరత్నంబుల ననుగ్రహించిన తమ కనారతకృతజ్ఞుఁడను.

కు:- గీ. ధర్మముల మేలుపంక్తులై తనరునట్టి
వంశవృద్ధులమార్గము ల్వదల మెపుడు
ల:- వంశమర్యాదలను నిలుపంగ నసువు
లను దృణములట్లు విడువంగఁ దొనక మెపుడు.

శ్రీ:- నాయనలారా! మీరజననీపుత్రులు. అంతవారేల కాకుందురు? కావలయుననియే మాయాశీస్సు.

భ:- అగ్రజా! వింటివా నినదము? అదియే శత్రుఘ్నుని యెలుఁగు. సెప్పుదియే విభీషణుని కంఠధ్వని. అదియే వానరరాజరావము. అదిగో గిం యాంజనేయుని రామమంత్రధ్యానము. ఇరుగో రానే వచ్చిరి.

(తెరలో)

ఉత్సా. రామ! రామ! రామ! రామ! రామ! రామ! రామ! శ్రీ
రామ! భక్తపారిజాత! రమ్యమానవాకృతీ!
సోమభానునేత్ర! మేఘసుందరాంగ! రాణ్మణీ!!
రామ! రామ! రామ! రామ! రాఘవా! పరాత్పరా!

(హనుమంతుఁడు ప్రవేశించి నాట్యముఁ జేయును. శతృఘ్న, విభీషణ, సుగ్రీవులు ప్రవేశింతురు)

శ,వి,సు:- శ్రీరామచంద్రమహాప్రభువునకు జై.

శ్రీ:- (నవ్వుచు) మిత్రులారా! రామధ్యానతన్మయులై ప్రస్తుతప్రభువుల గుఱితింప రైతిరా?

శ,వి,సు:- (పొరపాటు నటించుచు) కుశమహాప్రభువునకు జై. లవమహాప్రభువునకు జై. (మువ్వురు ధరందురు)

కు,ల:- పితృమిత్రులారా! ఆయాసనముల నలంకరింపుఁడు.

శ్రీ:- అనుజా! శత్రుఘ్నా! కుమారులు సుబాహుశత్రుఘాతు లేరోయి?

శ:- వారలు వారియన్నదమ్ములబడి మధురవైదిశపురంబుల కభిషిక్తులై పాలించుచున్నారలు.

శ్రీ:- అనుజులారా! ఇప్పటికిఁ గృతకృత్యుల మైతిమి.

హ:- (కన్నులు విప్పి యాశ్చర్యము నభినయించుచు) సింహాసనారూఢు లైనవారు నాచిన్నిప్రభువులా? నాకనులు సఫలములైనవి. మారామయ్యతండ్రి యేఁడి? (నలువైపుల వెదకును)

శ్రీ:- రామధ్యానతత్పరా! రామతత్త్వవిదా! పావనీ! ఇచటనే యున్నాఁడ రమ్మీ. (తిరిగి పైపద్యమును జదువుచు నాట్యము చేయును) భక్తాగ్రగణ్యుఁడు. ఈతని కిదియే భవతరణతరణి. విభీషణహనుమంతులారా!

వి:- చిత్తము.

హ:- (నాట్యముఁ జాలించి) ప్రభూ! ఏమియాజ్ఞ?

శ్రీ:-రామతత్త్వవిదులారా! రామనామమాధుర్యము నెఱింగినవారాట నిది యెంతకాల మీధరపై స్మరణీయమో యంతవఱకుఁ జిరంజీవులై మనుఁడు.

హ:- చిత్తము. నాభాగ్య మిట్లున్నది.

వి:- ఆజ్ఞావశుఁడనుగదా?

శ్రీ:- భరతశతృఘ్నులారా! నన్ననుసరింప నుద్యుక్తులైన యెల్లరను వెంటఁగొని నన్ను వెంబడింపుఁడు.

ఉ. మానవకర్మపంకమును మార్జనము న్బొనరించి దైవతా
మానసుఖంబు లిచ్చుసరయూతటినిన్ సరగ న్దరింపఁగాఁ
బూనుఁడు, తోవఁదీసెదను ; బుణ్యపదంబులన స్గరస్థముల్
ధ్యానము నావికుండునిపదద్వయి నుంచినభక్తకోటికిన్.

(విభీషణహనుమంతులుతప్ప నెల్లరును)—ధర్మాపరావతారా! మీయడుగుఁదమ్ముల ననుసరించినవారలభారము మీదేకదా ? ఇదిగో నిస్సంశయముగ వచ్చుచున్నారము. శ్రీరామచంద్రపర మాత్మకు జై. (నిష్క్రమింతురు)

కు,లు:- (రాచకీవితో సాగుచు) పుణ్యప్రదమగు జనకుల మహాప్రస్థానము కనులారఁగాంచుదము. (నిష్క్రమింతురు)

(తెరలేచును)

(వైకుంఠమున ననంతశయ్యపై నిందిరాదేవి కూరుచుండి యుండును)

ఇం:- కాలాతీతమైనను శ్రీనాథుఁ డింకను రాకున్నాఁడేమి ? అసమ యజ్ఞుఁడు కాఁడే ? (పరికించి యాతురముతో) అరుగో వచ్చుచున్నారలు. (ఎదురేగ విష్ణువు ప్రవేశింపఁ బాదాభివందన మొనరించును)

వి:- ఇందిరా ! కళ్యాణ మస్తు.

ఇం:- ప్రాణేశా !

గీ. ఒక్కపదిమాసములు లంకఁ జిక్కినట్టి
నావియోగానఁ జింతిల్లి నాథ ! నీవు
దశసహస్రాబ్దముల నేవిధము గడపితో ?
యద్భుతంబు మీచర్య దేవాధిదేవ !

వి:- ఇందిరా! పదునొకండువేలసంవత్సరము లిలపై నుండ సంకల్పించితిని. నిత్యానపాయిని వైననిన్ను వీడి యామితిమీటి యొకక్షణమైన నటనుండ నుత్సహింతునని తలఁచితివా ? చూచితివా యా విభీషణహనుమంతు లెట్లు రామనామధ్యాననిమగ్నులై మనవంకఁ జూచుచున్నారలో ?

ఇం:- వారల కేమేని కోరిక కలదేమో కనుఁగొందమా!

వి:- దేవీ! భగవద్భక్తుల కేమికావలయును? తైలధారావదవిచ్ఛిన్న ధ్యానమే వారల కాంక్ష. అంతకు మించి యేమేని కోరుదురని యా నీపరీక్ష? కానిమ్ము చూతము.

ఇం:- విభీషణహనుమంతులారా! సర్వజ్ఞుం డగుదేవదేవుఁడు మీకు వరంబు లియ్య సంసిద్ధుఁడై యున్నాఁడు. కోరుకొనుఁడు.

వి:- సకలజగజ్జననీ! నీయపాంగావలోకనమాత్రముననే లంకారాజ్యము నాకబ్బెను. సంతసమయ్యెను. నాకు రాజ్యమదంబుఁ బ్రసాదింపక జనకుని నిరంతరసేవాపరాయణత్వ మనుగ్రహింపఁజేయుము. అదియే నాయభిమతము.

ఇం:- హనుమంతా! నీకోరిక యేమి?

హ:- జగన్మాతా! అనర్ఘరత్నమగు శ్రీసీతారామరూపంబు నా హృదయపేటికయందు స్థిరమైయున్న దిదిగో చూడుఁడు. (రొమ్ము పగిల్చి సీతారాములను జూపును.)

వి:- ఇందిరా! భక్తులహృదయముల గుఱితించితివా? విభీషణహనుమంతులారా! అవకాశ మబ్బినను మీ కిప్పటికే యుండినభక్తినే మరలఁగోరితిరి. కావునను మీబోటిపుణ్యపూరుషు లీభరతఖండమున నున్నందున నీభరతఖండము ధన్యమయ్యె.

ఇం:- తథాస్తు.

వి,హ:- అనుగృహీతోస్మి.

ఇం:- మీభక్తాదరము నామమాత్రమేకదా? మీభక్తపరీక్ష నిశితము కదా?

వి:- ఇందిరా! ఏమ ట్లంటివి?

ఇం:- నాథా! శ్రీరామాయణమును నాటకపంచకంబుగ రచించినకవి నాశీర్వదించితిరా?

వి:- ఇందిరా! మఱచితి. అవశ్య మట్టుల జరుగవలసినదే.

గీ. ప్రథితశ్రీరామనాటకపంచకంబు
వ్రాయు నాదూరి వేంకటరంగసామి
కృతులు వెలయు నాచంద్రార్కకీర్తిఁ గూడి
శ్రీరమానాథు మేటియాశీస్సుకలిమి.

విష్వా:- మహాప్రసాదము. మహాప్రసాదము.

భ:- భక్తాభీష్టదా! మీకరుణాపాంగావలోకనమున ధరణికిఁ గొదువ యేమి కలదు?

వి:- అయిన నిట్లగుఁగాక.

—* భరతవాక్యము *—

మంగళమహాశ్రీ

భూవలయ మెల్లపుడుఁ బుష్కలముగాఁగ నెల
మూఁడుసమవృష్టులను బొందుఁ
భూవరులు ధర్మపథము న్విడక యస్థిరపు
భోగముల మానసము లేకే
కావరులఁ ద్రుంచుదురుగాత, సుసతీత్వమును,
గ్రాలెడినిగాక పితృభక్తుల్
కోవిదులు రామకథఁ గూర్చెదరు గ్రంథములఁ
గూరుపఁగ మంగళమహాశ్రీ.

గద్యము.

ఇది శ్రీమద్రామచంద్రనిర్వ్యాజకరుణాసాదితకవితావిరాజమానహారిత
సగోత్రోద్భవాపస్తంబసూత్ర ఆదూరివంశపయఃపారావారరాకా
సుధాకర కేశవాచార్యపౌత్ర వేంకటరామానుజాచార్యాంబా
శాంబాప్రియపుత్ర శ్రీరామచంద్రపాదారవిందేందిరాయ
మాణమానస శ్రీవైష్ణవపాదరేణు విబుధ
మిత్ర వేంకటరంగస్వామికవి ప్రణీత
శ్రీరామప్రస్థానము
సంపూర్ణము.